124

ఫిబ్రవరి 1982

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక



"ఆత్మరక్షణ కోసం...

---

సంవత్సర చందా : రు. 20 | ఈ సంచిక రు. 2

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

124 మాసపత్రిక ఫిబ్రవరి 1982



ముఖచిత్రం : 'ఆత్మరక్షణ' కోసం - అలిశెట్టి ప్రభాకర్

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా : రు. 20 ఈ సంచిక రు. 2

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 00 for Venkataramana Mudranalayam, Warangal

Working Editor: Varavararao

# సమ్మక్క, సారలమ్మ సంస్మరణ!

తెలంగాణలో రెండుజిల్లాల్లో రెండువారాల వ్యవధిలో రెండు ఆదివాసుల జాతరలు జరిగినవి. ఆదిలాబాద్ జిల్లాలో కేస్లాపూర్ జాతరా, గోండులదేవత నాగోబాను కొలవడానికి ఈదేవతకు గుడివున్నది. నలభైయేళ్ళనుంచి దీనికి కేస్లాపూర్ దర్బార్ కూడ జతఅయింది. ఆదిమాత్రం నైజాంకు వ్యతిరేకంగా పోరాడి మరణించిన కొంరంభీం నాగరిక ప్రపంచం ముందుకుతెచ్చిన ఆదివాసుల సమస్యల ఫలితం. ఇప్పటికీ బాబేఝరీలో ఒక కొయ్యపాతి కొంరంభీంను తలచుకొంటారు గోండులు. బాబేఝరీ ఇంకా తమవీరులను గోండులు స్మరించుకునే స్థలంగానేవున్నదికాని కేస్లాపూర్ జాతరమాత్రం మరాఠాల, లంబాడీల, అందరికన్నా ఎక్కువగా పోలీసుల, అధికారుల వేడుకగానో, 'వేట'గానో మారింది.

ఏడువందల సంవత్సరాలకిత్రం కాకతీయరాజు ప్రతాపరుద్రుని సైన్యంతో పోరాడి మృతవీరులైన పగిడిద్దరాజు, సమ్మక్క, సారలమ్మలు ఆదివాసుల అణచివేత ఈదేశంలో ఎంతకాలంగా కొనసాగుతున్నదో మేడారం జాతరరూపంలో మళ్ళా ఒకసారి మనదృష్టికితెస్తారు.

మేడారం వరంగల్ జిల్లా ఏటూరునాగారం తాలూకాలో వరంగల్‌కు ఈశాన్య దిశలో దాదాపు 120 కిలోమీటర్ల దూరంలోవుంది. గోదావరి తీరంలోని ములుగు ఏజెన్సీప్రాంతం, దానినే ఆనుకొనివున్న నర్సంపేట అడవులు కోయలకు ఆవాసాలు. ఈకోయ పరగణాకు నాయకుడు పగిడిద్దరాజు. ఇతనిసేనాని జంపన్న. సమ్మక్క ఇతనిభార్య. సారలమ్మ కూతురు. ఈ కోయరాజు తమకు కప్పంచెల్లించి తమ సార్వభౌమత్వాన్ని అంగీకరించాలని ప్రతాపరుద్రుడు ఒత్తిడితెచ్చాడు. కరువు కాటకాలు వచ్చినా, అతివృష్టి అనావృష్టి పట్టించుకోకుండా కాకతీయ సామ్రాట్టులకు కప్పం చెల్లించాలి. విసిగెత్తిన పగిడిద్దరాజు కప్పంకట్ట నిరాకరించాడు. ప్రతాపరుద్రుని ఆజ్ఞమేరకు ఆయనమంత్రి యుగంధరుడు యుద్ధం ప్రకటించాడు. ఆ యుద్ధంలో పగిడిద్దరాజు, ఆయనసేనాని జంపన్న మరణించారు. ఈ వార్తవిన్న సమ్మక్క, సారలమ్మలు యుద్ధానికితలపడి వీరోచితంగాపోరాడి కత్తియుద్ధంలోగాయపడి స్పృహకోల్పోయారు. తమచుట్టూ గుమిగూడిన ప్రజలతో తాముమరణించేచోట గద్దెలుకట్టి రెండు సంవత్సరాలకోసారి జాతర చేయవలసిందిగా కోరినట్లు స్థలపురాణంవున్నది. రెండు సంవత్సరాలకోసారి జరిగే ఈ మేడారంజాతరకు లక్షలాదిజనం వస్తారు.

తెలుగుదేశ చరిత్రలో వీరనారిరుద్రమ, మగువమాంచాల కథలు చెప్తారుగానీ సమ్మక్క, సారలమ్మల వీరమరణం గురించి చెప్పరు. తెలుగు సంస్కృతిని

స్వాతంత్ర్యాన్ని కాపాడడానికి ప్రతాపరుద్రుడు తురుష్కులతో చేసిన యుద్ధాల గురించి చెప్తారుగానీ ఆ ప్రతాపరుద్రుడే ఆదివాసుల సంస్కృతిని స్వాతంత్ర్యాన్ని ఎట్లా అణచ వేయజూసాడో చెప్పరు.

కాని తెలంగాణ నిండావున్న సమ్మక్క సారలమ్మ, సమ్మయ్య సారయ్యల పేర్లుచూసినా, (సంస్కృతీకరింపబడిన సంపత్ నామంకూడ సమ్మక్క మొక్కు 'ఫలితమే') ముఖ్యంగా సమ్మక్క మొక్కులు, సమ్మక్కపూనకాలు చూసినా మన ఇటీవలి చరిత్రలోని మనుషులే ఎంతగా 'దేవతల'యిపోయారో గ్రహించవచ్చు. లక్షలాదిమంది జనం (ఈసారి ఆర్‌టిసి సమ్మెవల్ల బస్సులు నడవకపోయినా పదిహేను లక్షలమంది ఈ జాతరకు వచ్చారని ఇండియన్ ఎక్స్‌ప్రెస్ రాసింది) దాదాపు అందరూ మనువునిర్వచనం ప్రకారం 'శూద్రులు' యీ జాతరకు వస్తారు. సమ్మక్క, సారలమ్మల జ్ఞాపకార్థం కొండమీంచి కొమ్మతెచ్చి పాతుకొని స్మరించుకుంటారు. బలులు, మొక్కులు బెల్లం, కొబ్బరికాయలు గుట్టలు గుట్టలుగా పోగవుతాయి. ఆకాశాన్ని ధూళిమేఘాలు ఆవరిస్తాయి. భూమిని జనసముద్రం ముంచెత్తుతుంది.

అయినా ఇవ్వాళ ఇది ఆదివాసులు తమ వీరుల్ని స్మరించుకునే జాతరగా ఏమాత్రం లేదు. ఇక్కడ ఒక్కకోయవాడు కోయవేషంలో కనిపించడు. అడవిలేదు. జంపన్నవాగు ఎండిపోయింది. కాలిబాటలు, బండ్లబాటలు (అవికూడ గిరిజనేతరులు చొరబారి వేసినవే) యంత్రవాహనాలు ఆదివాసుల నేలతల్లి గుండెల్ని పెకలించిరేపిన దుమ్ములో మాసిపోయాయి. జంపన్నవాగులో చలిమతోడుకు నీళ్ళు తాగినప్పుడో, వాగావల అడవిలో సుదూరాన మద్దిచెట్ల మౌనాన్ని విన్నప్పుడో, కొండమీద గుడి, గోపురం, విగ్రహం ఏదీలేకుండా మూలికరూపంలో సమ్మక్కను పూజించిన చరిత్రా రణ్యంలోకి వెళ్ళివెతికినప్పుడో మాత్రమే ఒకప్పుడిక్కడ స్వతంత్రంగా జీవించిన ఆదివాసుల సంస్కృతి వుందని ఊహించలేము.

మేడారంజాతర స్థలపురాణాన్ని కనీసం ఈసారయినా ప్రకటించిన అధికారుల చారిత్రిక దృక్పథంలోని దారిద్ర్యమనాలో, నాగరికప్రభువుల ప్రభుతఅనాలోగాని కాకతీయ సామ్రాజ్యంతో పోరాడి అమరులైన వీరుల స్మృతిలోజరిగే జాతరకువెళ్ళే మార్గానికికూడ కాకతీయద్వారమే ప్రవేశంగావుంచాలని తోచిందివాళ్ళకు. పాలకుల 'నాగరికతను' రాజకీయాధికారంతోపాటు ఆదివాసులపైరుద్దే ఈ ఆక్రమణనీతికి వేర్లు ఎంతలోతుగావున్నాయో అడవికడుపున అన్వేషిస్తేగానీ అంతుచిక్కదు.

జాతరలపేరుతో, రిపబ్లిక్‌డే సాంస్కృతిక ఉత్సవాలపేరుతో, గిరిజనోద్ధరణ పేరుతో మనపాలకులు ఆదివాసుల ఆవాసాల పైననేకాదు, వాళ్ళ స్వతంత్రమైన

ప్రైవేట్ జీవితాలమీదనేకాదు, వాళ్ళ ప్రత్యేకమైన విశ్వాసాలమీదనేకాదు, వాళ్ళ చరిత్ర, సంస్కృతులపై సాంస్కృతిక దాడిచేస్తున్నారు. వాళ్ళ స్వేచ్ఛమైన నిసర్గమైన సుందరమైన జీవనసంస్కృతులను తమ వినోద వ్యాపకాలకోసం వేటాడుతున్నారు- ఆటలాడుకొంటున్నారు. మనుషుల్ని వేటాడుతూ 'వన్యమృగ సంరక్షణ'కు పూనుకుంటున్న ప్రభుత్వం, మానవజీవితంలోని జీవధాతువునుకాలరాస్తూ ఆకుపచ్చ విప్లవంగురించి ప్రబోధిస్తున్న ప్రభుత్వం ఈదేశంలోని ఆదిమజాతుల, జాతుల, ఉపజాతుల జీవితాలతో చెలగాటమాడుతూ వాళ్ళబతుకూ వాళ్ళదికాకివ్వకుండా, వాళ్ళ అడవీ, గూడెం వాళ్ళదికాకివ్వకుండా, వాళ్ళ ఊరూపేరూ వాళ్ళదికాకివ్వకుండా, వాళ్ళ కాయకష్టం వాళ్ళదికాకివ్వకుండా, వాళ్ళఅడవి, ఆనందం వాళ్ళదికాకివ్వకుండా, వాళ్ళగతమూ, స్మృతులూ వాళ్ళవికాకివ్వకుండా, వాళ్ళ జాతకాలనూ తానే రాసి వాళ్ళ జాతరలూ తానేజరుపుతున్నది. ఈ జబర్దస్తీ 'ఆదరణ' (Patronage)లో 'జాతర' నిజస్వభావం నివురుగప్పకపోయింది.

15-2-82 సంపాదకుడు

## నిన్న ప్రెస్‌పై, ఇవ్వాళ ప్రింటింగ్ ప్రెస్‌పై దాడి... రేపు...?

మొన్న 'మట్కా' జూదరుల గూండాయిజం గురించి 'కేకలు' సంపాదకుడు భైరవరామదాసు రాస్తే ఇద్దరు కౌన్సిలర్లు గూండాయిజంతోనే అతనినోరు మూయించాలని చూసారు నిజామాబాదులో.

నిన్న పోలీసు దౌర్జన్యాలపై రైతుకూలీ సంఘం వేసిన కరపత్రాన్ని అచ్చేసినందుకు నిర్మలా ప్రింటింగ్ ప్రెస్ యజమాని విజయకుమార్‌పై పోలీసులే దౌర్జన్యం చేసారు కరీంనగర్‌లో.

వేలుబెట్టి తప్పును చూపితే దిద్దుకోవాల్సిన స్థానంలో 'ప్రజా' ప్రతినిధులు, 'ప్రజా' సేవకులు వుండవలసిన 'ప్రజా'స్వామ్యంలో ప్రజాభిప్రాయ వ్యక్తీకరణ సాధనాలయిన పత్రికలమీద, చివరకు ప్రింటింగు ప్రెస్‌ల మీదకూడ దాడులుజరుగుతున్నాయి.

విజయకుమార్ ఇదివరలో 'విద్యుల్లత' పత్రికాసంపాదకుడు. విరసం సభ్యుడు ఇప్పటికీ పౌరహక్కుల ఉద్యమంలో కార్యకర్త. 'మార్చ్' కవితాసంకలనం అచ్చువేసాడని, 'ఎర్రబట్ట' కథ అచ్చువేసాడని, మరెన్నో కారణాలతో పదేళ్ళుగా అడపాదడపా పోలీసులాయనను వేధిస్తూనేవున్నారు. ఎమర్జెన్సీలో పోలీసులు ఆయనను చిత్రహింసలకు గురిచేసి మీసాకింద జెయిల్లోపెట్టారు. ఇప్పుడు ఆయన చేసిందల్లా

కరీంనగర్ గ్రామీణ పోలీసుస్టేషన్ సబ్ - ఇన్‌స్పెక్టర్ నరసింగరావు ప్రజలపై చేస్తున్న దౌర్జన్యాలపై రైతుకూలీ సంఘం ప్రకటించిన కరపత్రాన్ని అచ్చువేయడమే. అందుకు చట్టబద్ధంగా అవసరమైన డిక్లరేషన్ ఆయన ప్రచురణకర్తలతో తీసుకున్నాడు జీవనోపాధికోసం పెట్టుకున్న ప్రింటింగ్ ప్రెస్‌లో ఆదిలాబాదు, కరీంనగర్ రైతాంగ పోరాట ప్రచారానికి సంబంధించిన విషయాలు అచ్చువేయకూడదన్న అప్రకటిత పోలీసుల నిషేధాన్ని ఆయన పాటించలేదు. ఎర్రకరపత్రానికైనా, నల్లకరపత్రానికైనా చెల్లించేవి తెల్లనాణాలే అయినపుడు లేదా కరెన్సీనోట్లే అయినపుడు కమ్యూనిస్టుల పైసలు పట్టవని ఎందుకు చెప్పాలో ఆయనకు తోచలేదు. పైగావాళ్ళు పోలీసులాగా, మరికొన్ని అధికారబలంవున్న బలగాలలాగా డబ్బు ఇవ్వకుండా జులుంతో పనిచేయించుకునేవాళ్ళుకాదు. నల్లడబ్బును తెల్లగా మార్చుకోవడానికి అచ్చేసేవాళ్ళుకూడకాదు. ప్రజల అవసరంకోసం ప్రచురణ సహాయాన్ని కోరేవాళ్ళు. సూది, దారం తీసుకున్నా రెక్కాగట్టి ప్రతిఫలం ఇచ్చేవాళ్ళు.

ఈ హేతుబద్ధత పోలీసులదగ్గర పనిచేస్తుందా? ఒకరోజంతా పోలీసుస్టేషన్‌లో పెట్టి విజయకుమార్ కాళ్ళపై, చేతులపై, వీపుపై నెత్తురుల్లిందేలా కొట్టాడు ఎస్. ఐ. నర్సింగరావు. ఇప్పటికీ ఆ గాయాలమచ్చలు ఆయన శరీరంనిండా వున్నాయి. పైగా విజయకుమార్ పైననే కేసుపెట్టి కోర్టులో హాజరుపరిచాడు. ఈ దౌర్జన్యాన్ని కరీంనగర్ లోని ప్రింటింగ్ ప్రెస్‌లు, పౌరహక్కులసంఘాలు, ప్రతిపక్షపార్టీలు అందరూ ఏకకంఠంగా ఖండించారు. కరీంనగర్ బంద్ పాటించారు.

అయితే, ఇంతజరిగినా విజయకుమార్‌ను కొట్టిన ఎస్. ఐ. నర్సింగరావును సస్పెండ్ చేయడంగానీ, నేరవిచారణ చేయడంగానీ, జరగలేదు. అంతేకాదు కరీంనగర్ బంద్ కరపత్రాన్ని మంచిర్యాలకు తీసుకివెళ్ళిన గోదావరిఖని కార్మికుణ్ణి మంచిర్యాల పోలీసుస్టేషన్‌లోపెట్టి కొట్టారు. అడిగినవాడులేడు.

ప్రెస్‌పై దాడిఅంటే అభిప్రాయాలపైదాడి- ప్రింటింగ్ ప్రెస్‌పైదాడి అభిప్రాయాలతో తనకు సంబంధంవున్నా లేకున్నా నిర్వహించేవృత్తిపైదాడి. ప్రవృత్తినీ, వ్యావృత్తినీ, వృత్తినీ నిర్దేశించే ఈ పోలీసురాజ్యంలో అధికారాన్ని బలపరచే మూసలోతప్ప మనిషి మరోకరకంగాపుట్టి, పెరిగి ఊపిరిపీల్చే అధికారంలేదా- ఇట్లా అడగడంకూడ మళ్ళా ప్రశ్నించడమే అవుతుందికనుక ప్రశ్నించడం ప్రభుత్వం దృష్టిలో మళ్ళా నేరమేఅవుతుందిగనక వివేకానికి విరుద్ధంగావున్న ప్రవర్తనను ప్రశ్నించకుండా వుండడం బుద్ధివున్నమనిషికి సాధ్యమేనా?

— సంపాదకుడు

# తల్లీ ఇంద్రవెల్లీ! వెడతావా ఢిల్లీ!

ఎ. ఎస్.

ఇంద్రవెల్లీ
వార్తల్లోకెక్కినావా తల్లీ!
నిన్ను దువ్వుతరు, ఓదారుస్తరు
నీచేత వేషాలేయించి
మిల్ట్రీ కవాతులముందు ప్రదర్శిస్తరు
అడివిలోనికి నిన్ను జయించడానికి,
నిన్ను సర్వం కొల్లగొట్టడానికి,
రోడ్లేస్తరు-
రోజూ దుమ్ము రేపుతూ జీపుల్లో గద్దలు-
నీ అణువణువు శోధించి-
ఒక్కొక్క నీకొడుకును, కూతురును,
ఇనుపగోళ్ళల్లో ఇరికించుకొని ఎగిరిపోతాయి.
యుద్ధంచేస్తున్న వాడిలాగా
నీచుట్టూ పోలీసుక్యాంపుల చక్రబంధంవేసి
నిన్నుమాత్రం ఢిల్లీకి
స్వాతంత్ర్య ఉత్సవాలకు ఆహ్వానిస్తరు.
నీకు స్వాతంత్ర్యం ఇవ్వడమంటే
పొరకపోడు గొట్టుకున్న నీభూమి నీకివ్వడంకాదు-
పోగొట్టుకున్న నీ కొడుకుళ్ళ్ని
నీకివ్వడంకాదు-
నీకు స్వాతంత్ర్యం ఇవ్వడమంటే
నీ ఎడ్లజత నీకు
నీ ధాన్యం నీకు
నీ బంగారం నీకు
నీ స్వేచ్ఛ నీకు ఇవ్వడమసలే కాదు
నీకు స్వాతంత్ర్యమివ్వడమంటే
కుక్కల్లా చొంగలుకారుస్తూ
పదే పదే స్వేచ్ఛ గురించిన చిలుక పలుకుల

ప్రసంగాలు చెయ్యడం
నీకు బతికే స్వేచ్ఛను కాదు
తప్పనిసరి మరణించే స్వేచ్ఛను మాత్రమే ఇస్తారు.
నిన్ను చంపడానికి వాళ్లు స్వేచ్ఛ పెంచుకుంటరు
నిన్ను మాత్రం ఢిల్లీకి ఆహ్వానిస్తారు
నీ కన్న కొడుకు త్యాగాల రక్తంతడి ఆరీఆరక
పచ్చిపుండల్లే నీ హృదయఘోష అనంతం
నీ గోళ్లల్లో సూదులు
కాళ్లమీద రోకలిబండలు
మొత్తంగా నీవీపుమీద నాలుగు పర్వతాలు
అయినా నిన్ను అలంకరించి
ఢిల్లీకి ఆహ్వానిస్తరు
ఇంద్రవెల్లీ నువ్వు ఢిల్లీకిరా
నిన్ను నేను ప్రేమిస్తున్నా
బండల్నుండి, కొండల్నుండి
బంకనుండి - కంకబొంగుల్నుండి
తియ్యటి తేనెనుండి - తియ్యటి మనసునుండి
నిన్ను పిండుకుంటూ....
తల్లీ అదికుట్ర
అన్నలకూ నీకూ గండికోసం
నాగరిక గద్దలు పన్నినకుట్ర
నీ ఒంటిని గొలుసులతో బంధించి
వాళ్లు వ్యాపారం చేస్తూ
నిన్ను చంపే స్వేచ్ఛ మిల్ట్రీకిస్తరు-
నీ భూమిని వడ్డీవ్యాపారికి
నీ బతుకును అధికార్లకు
నీ ఎడ్లను, గొడ్లను
నీ ఆలిని - అక్కచెల్లెళ్లను, అమ్మను
మందికిచ్చి నిన్ను మాత్రం ఓదారుస్తరు
నీ కళ్లల్లో యాసిడ్ మాత్రమేపోసి

నీ కన్నీళ్లను తుడుస్తరు
నీ కన్నకొడుకుల గుండెల్లో
తుపాకులు పేల్చి
నిన్ను మాత్రం ఢిల్లీకి ఆహ్వానిస్తరు
ఇంద్రవెల్లీ - ఇదికుట్ర!
కాని నీ రక్తగాయాలకు కట్లుకడుతూ
నీతోపాటే అన్నలున్నరు - నువ్వున్నవు
ఎత్తైన పర్వతాల కడుపుల్లో
ఎత్తిన రగల్‌జెండా లాగా
నీ ఉచ్ఛ్వాస నిశ్వాసలున్నాయి
ఎగిరే రగల్‌జెండాగా
తల్లీ! ఎగరేయి ఎత్తినపిడికిళ్లను ...

[రిపబ్లిక్‌డే ఉత్సవాలకు ఇంద్రవెల్లి గిరిజనులను ప్రభుత్వంవారు ఢిల్లీకి ఆహ్వానిస్తారట!]

## మేం రాస్తూఉంటాం

కె. శివారెడ్డి

ఎవరిల్లో తెలియదు - ఇంట్లో ఎవరుంటున్నారో తెలియదు
కానీ మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని-
అది కొట్టో జైలుగోడో తెలియదు
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని
అది ప్రహరీగోడో పార్లమెంటుహాలో తెలియదు
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని
రోడ్డుకడ్డంగా రెండుస్తంభాల మధ్య రాస్తాం - విప్లవం వర్ధిల్లాలని
కూడలిలో నెహ్రూగారి నుదుటిమీద రాస్తాం - విప్లవం వర్ధిల్లాలని

జనంతో కిక్కిరిసివెళ్తున్న బస్సులమీదా
రైలుపెట్టెలమీదా నున్నని బట్టతలలాంటి కార్లమీదా
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని
స్కూళ్ళమీదా కాలేజీలమీదా

విశ్వవిద్యాలయాల గుండెకాయలమీదా
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని
నీటిమీదా
నీటినిమోసుకపోయే నదులమీదా
నదులవేళ్ళు పంటకాలవలమీదా - పంట పొలాలమీదా
చేలమీదా చేలమట్టిమీదా
మట్టిలో జీవిస్తున్న చేతులశ్రమమీదా
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని

దోవలమీదా డొంకలమీదా
ఊళ్ళలోకి చొచ్చుకుపోయే కాలిదోవలమీదా
దోవల దోసిళ్ళ నిండుగావున్న దుమ్ముమీదా
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని
రోడ్ల మీదా రాస్తాం
రోడ్ల పక్కనిలబడ్డ మైలురాళ్ళమీద రాస్తాం
చిన్న చిన్న కంకర రాళ్ళమీద రాస్తాం
మట్టి పెళ్ళలమీద రాస్తాం - విప్లవం వర్ధిల్లాలని

కొండల మీదా
కొండల శిరసెక్కి ఆకాశం విశాల వక్షస్థలం మీదా
ఆకాశం ఆలోచనల మబ్బులమీదా
మబ్బుకురుస్తున్న వానమీదా
వానలోని చినుకు చినుకు మీదా
చినుకుతో కలిసి పడుతున్న నూత్న తేజస్సుమీదా
తేజస్సును పట్టుకుంటున్న గింజలమీదా
గింజల ధ్యానసముద్రాల మొలకలమీదా
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని

చెంపమీద వేళ్ళాడుతున్న జుట్టుమీదా
చెదరిపడుతున్న కలలమీదా
కలల్ని మోస్తున్న రాత్రి నల్లనిపెదాలమీదా
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని

చించి పారబోసిన చిత్తుకాయితాల ముక్కలమీదా
ముక్కల్లో వెలుగుతున్న ప్రతి అక్షరంమీదా

గాల్లో ఎగిరే చెత్తపరకలమీదా
చిరు చిరు దీపాలమీదా - కాంతి స్లోగన్లమీదా
ప్రతి అంగిట్లో మొలిచే ప్రతిశబ్దం మీదా
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని
ఆకుల మీదా రాస్తాం
అడవి మీదా రాస్తాం
చెట్లమీదా రాస్తాం - చెట్లబెరడు మీదా రాస్తాం
చెట్లగర్భం చీల్చుకువస్తున్న చిగురుటాకుల మీదా రాస్తాం
ప్రతి వేలిచివర మీదా - ప్రతి కాలిమీదా
ప్రతి పాదముద్ర మీదా - ప్రతి ఊపిరిమీదా
ఉజ్జ్వలంగా ఎదుగుతున్న ప్రతివాలుడి రక్తంమీదా
రక్తంలో జనిస్తున్న ప్రతి సూర్యుడిమీదా
మేం రాస్తూవుంటాం - విప్లవం వర్ధిల్లాలని

## కథా సాహితి

హైదరాబాదు

13-12-1981 కాళీపట్నం రామారావుగారితో హైదరాబాదులోని సామాజిక చైతన్యంగల కథా రచయితలు కొంతమంది ఇష్టాగోష్ఠి జరిపారు.

మంచి కథని పెంపొందించేందుకు రచయితలకు ఒక వేదిక అవసరమని భావించి 'కథా సాహితి' అనే వేదికను ఏర్పాటు చేసుకోవడం జరిగింది.

ఈ వేదిక సామాజిక అవసరాలను, సమాజాభివృద్ధిని కాంక్షించే రచనలకు అండగా నిలుస్తుంది. పెడధోరణులకు వ్యతిరేకంగా మంచి కథలను అందిస్తుంది. పాఠకులలో ఉత్తమాభిరుచులను పెంచుతుంది.

ఈ లక్ష్యాలదృష్ట్యా కథాసాహితి వేదిక తరపున 'కథ' అనే బులెటిన్ వెలువరించాలనుకుంటున్నాం. పైలక్ష్యాలతో ఏకీభవించే రచయితలు సభ్యులుగా చేరి వేదిక కార్యక్రమాలకు అండదండలు అందించాలని మనవి.

కథా రచయితలేకాక సంస్థలు, సానుభూతిపరులు తమ సహాయ సహకారాలు అందిస్తారని ఆశిస్తున్నాం. తెలుగులో మంచి కథలు వెలువడ్డానికి జరిగే కృషిలో పాలుపంచుకోవలసిందిగా విజ్ఞప్తి.

జయధీర్ తిరుమలరావు, కన్వీనర్

అడ్రెసు : 1-8-1/117, సూర్యానగర్, చిక్కడపల్లి, హైదరాబాదు.

# రక్తపింజెర

సాహూ

చలికాలం బయటనిలబడితే దాదాపు ఇరవైనిమిషాల్లో తడిసిముద్దయి వణవణ వెన్నుపొంట వణుకొస్తుంది. గోండోని బతుకుపోరాటమంత దీర్ఘచలిరాత్రి- భయంకరంగా గడ్డకట్టుకపోయిన నిశ్శబ్దం.

అలాంటి భయంకరమైన చలిరాత్రి- చుట్టూ కోటగోడల్లాగా ఎత్తయినకొండల మధ్య నాలుగుగూడాలు- ఆ నాలుగుగూడాల్లో మిగిలినవాటికన్న కాస్త పెద్దదైన గూడెంలో పదిహేను గుడిసెలుంటాయి- ఇప్పుడో అప్పుడో కూలిపోవడానికి సిద్ధంగా ఉండి తలుపు గొళ్ళెంలేక కాటికి కాళ్లుబారజాపుకొని గోండుమునలోళ్ళలాగా గుడిసెలు కూరుకుతున్నాయి. ఏ గుడిసెలోకూడా దీపంలేదు- దీపాలులేకకాదు- దీపాల్లోసమరు లేక- సమరు కొనేందుకు కొత్తల్లేక....

బొగడమీద ఇండ్లంటివే ఓ ఇందిరమ్మో
ఆహాఁ.... బొంగురాల తలుపంటివే
బొగడమీద ఇండ్లేవే ఓ ఇందిరమ్మ
బొంగరాల తలుపులేవే
ఇంటికొక్క బల్బంటివే ఓ ఇందిరమ్మ
ఇండ్లల్ల ఎలుగులంటివే
ఇరువై సూత్రాలంటివే ఓ ఇందిరమ్మో
ఇందిరిలోకం తెత్తనంటివే....

ఈపాట గట్టినవాడెవడోగాని- వాడింతకుముందు ఇలాంటిగూడాన్ని సూసుండాలె. దీపం బెట్టుకోను దిక్కులేనివాళ్ళే ఈదేశంలో కోటానుకోట్లు.

అలాంటి గూడెంలో నడిజాము తిరిగిపోయింది. ఆకాశంలో చుక్కలు ఆకలికి చచ్చిన శవం కళ్లమాదిరిగా పాలిపోయి వెలుగుతున్నాయి ... గుడిసెలముందు చిటపట లాడుతూ నెగళ్లమండుతున్నాయి- ఆనెగళ్ల పక్కనే దుమ్ములో ఒంటిమీద గుడ్డన్నా లేకుండా- ఈడ్చుకపోయే కడుపులతో కొందరు నిద్రపోతున్నారు.

చిట్టచివరి గుడిసె శిడాంశిత్భది.

శిడాంశిత్రు కళ్ళు నెగడుమంటల్లాగా మండుతున్నాయి నిద్రరాదు- మనసును తొలుస్తున్న ఆలోచనలు అంతంకావు. ఆకలిమంట చల్లారదు. నెగడుపక్క ముడుచుక

పడుకున్న బిడ్డను చూశాడు. పాత పంచెబొంత కప్పుకొనికూడా పిల్లవణుకుతోంది. ఆపిల్ల తువ్వలాంటివెంట్రుకలు దుబ్బువిడిపోయున్నాయి.

పిల్ల కాళ్ళునిగ్గదన్నింది. నెగడులో కాలు- చురుక్కుమన్నది. పిల్లమొత్తుకున్నది. పిల్లపక్కనే పండుకొన్న తల్లిలేచి మళ్ళీబిడ్డమీద బొంతకప్పింది. పిల్ల ఏడుపురాక మూలుగుతూ నిదురలోకి జారుకున్నది. శీత్రి కాలిమచ్చలేర్పడిన పెండ్లాంకాళ్ళకేసి చూస్తూ కూర్చున్నాడుకాసేపు- విసుగొస్తోంది. దూరంగా వల్లగా భయంకరంగా కనిపించే కొండలకేసి చూశాడు. ఎక్కడో చెట్టుమీద చలికి వణకుతుండక పక్షిఏదో బలహీనంగా అరుస్తోంది. లేచిగుడిసెలోకొచ్చాడు. గుడిసెతన్నాలు- వెత్తికిచూడుకొట్టుకున్నది. గుడిసెను కట్టాలన్నా ఓపికలేదు. తనకేదన్న పాతపంచెబొంత దొరుకుగల దేమోనని ఆత్రంగా వెతికాడు- ఇల్లాకాదల్లేతున్నది. ముఖంచిట్లించి గుడిసెబయట కొచ్చాడు- చలి, ఒళ్ళంతా దరిద్రంలాగ పాకేచలి. "ఉవ్వావ్వా... వ్వావ్వా" దవడలు దవ్వలుకొడుతుంటగా నెగడువెగేసి ముందుకూర్చున్నాడు.

నెత్తిమీద బొబ్బకట్టింది- తడిమిచూసుకున్నాడు. "ఇయ్యేడన్నా గుడిసె బాగు చెయ్యాలె" అనుకున్నాడు మనసులో- గుడిసె బాగుచేయాలంటే కర్రిగావలె- కర్రింటే "అమ్మో శాకిబద్దల పోకిదారు" గుర్తొచ్చి వణుకొచ్చింది. చౌకిదారు ఎర్ర కండ్లు- వాడొస్తేనే కోడికావాలంటాడు- కోడియిచ్చినా దవడలు విరుగ్గొట్టేదికాయం. దవడలు విరుగ్గొట్టినా దండుగ దబ్బులుతప్పేదిలేదు. సముద్రం తలాపునబెట్టుకొని సావనీళ్ళకేడ్చినట్టైనతు- ఇలాంటి పండుగుడిసెల్లో పగలురేయి దరిద్రం తాండవ మాడుతుంది.

నెగడు చిటపటమంటోంది. ఆ చప్పుడుకు శీత్రిపెండ్లాం మల్కుబాయి లేచింది. కనపిన వెత్తిగోకింది.

"నువ్వింకా పండలేదా?" అడిగింది....

మొగడు మాట్లాడలేదు- మాట్లాడటానికేముంది? అమ్మాయిలకైనా ఓపికుండాలి కదా! పక్కలకేసి చూసింది- తెల్లారేటట్టులేదు- మొగనికేసిచూసింది. శీత్రి కుడికాలు పాదంలోంచి చీముకారుతోంది- తనకు పెండ్లయిన దగ్గరనుండి అప్పుడట్లా చీము కారుతూ ఉండటం చూస్తూనేఉన్నది. అదిమామూలే. చలి... మల్కుబాయి నెగడు దగ్గరికి జరిగి "నతి గరీబోళ్లని పంపనీకి బుట్టిందో! లేక మీదగాసరిల సావుండ్లని మనల గుబ్బలకు తరిమిండ్లో! ఏమో! ఉబతుకు జరుతోదు." అన్నది- మల్కుబాయి అది

నాలుగోసారి లేవడం- తెల్లరడానికి ఇంకా చాలా రాత్రేఉన్నది. గూడెంలో అలికిడేమిలేదు. కొరివిదయ్యాల్లాగా అక్కడక్కడ మంటలు తప్పిస్తే!

సిత్రు చుట్టముట్టిచ్చుకున్నాడు- పొగతోపాటు గొంతుపెకిలి మాటొచ్చింది. "వానపాయె - పంటపాయె, ఇంగనీయవ్వ తిననీకైతె లావుతిప్పలు గాలిపాయె- తక్కిబున్నది బాయి ఎట్లనో ఏందో?" ఆరిపోతున్న చుట్టనుపీల్చి "ఎందుకు పేన్కు (దేవుడు) గిట్లసూత్తాండే బాయి," అని ఆరిపోయిన చుట్ట మళ్లీ ముట్టిచ్చుకున్నాడు.

అతని పెత్తల గోరెడు మాంసం లేకుండా ఆకలితినేసింది- ముప్పయేండ్లకే ముసలోడయ్యిండు- దూరంనుంచి కూడా అతని బరిబద్దబొక్కలు లెక్కపెట్టచ్చు.

"పేన్కుగూడ పెద్దల మజ్జతే ఏంజేద్దాం- అందరుసత్తే మనంసత్తం- అందరు బతుకుతే మనంబతుకుతం. పేన్కుకు తక్కువపెయ్యకపోతిమి. పెయ్యకట్టపడని దినంలేదాయె- అందరు బొంగుపనికి బోతరట- మనంపోదాం. పోరినితిన్కపోదాం- ఇంగే దిక్కులేకపాయె- పంటపోతే పటుమని పదికొత్తలిచ్చెటోడు లేకపాయె సర్కారోడు అప్పిత్తడని కాలుకు బట్టకట్టకుంట దిరిగి పేసినకట్టం నూరూపాలు ఆడెవడో బేంకు పెద్దకు లంచమిత్తె ఆకుక్కలకొడుకు బేంకులకుబోతె మెడలుబట్టి బయటికినూకె- అంగట్లకుబోతె షావుకార్లేమొ మీకు బేంకులిచ్చె పైరకల సాల్లచ్చిరని గురుకినబట్టె- సావుకాలమచ్చింది." మల్కుబాయి ఇంకా చాలా చాలా మాట్లాడాలనుకుంది కాని అక్కడికే ఆఖరిమాట నాభిలోనుంచి పెకిలచ్చింది.

కాలేకడుపులోల్లు ఇంతకన్న ఎక్కువేం మాట్లాడుకోగలరు. ఊసులాడ, బాసలాడ ఒంట్లోసత్తువేది. అడివిల జంతువుల్లాగే తప్పనిసరి ఆ సంబంధం- అందులో ఇలాంటి విదురబట్టని రాత్రుల్లో ఒకటోరెండో మాటలు. ఆమాటలు వాళ్ళ ఒకరికొకరు ఆత్మీయంగా పలుకరించుకునేవికావు. ఒకరి కష్టసుఖాలు ఒకరు విచారించేవికావు. సూర్యుడు బయటికెలితే గోండోల్లు బయటకు వెళ్ళతారు. ఏతవిపివెట్లవెంటో ఏ కంకపొదలల్లోకో జారుకుంటారు. మళ్ళీకలయిక చీకటితోనే....

"మొన్న బొంగు సుప్పరవేజర్ కడగూడెంల పైసలిచ్చిపోయిండు. నూరు రూపాలు తీసుకత్తి- ఇయ్యాల్లినుంచి పనికిబోవాలే. నువ్వేమొ అంగడిబోయి జొండ్లు తెమ్మనబడితివి- నిన్న సుకపెట్టకపోయినా మాపుకు పీరన్నాలేకపాయె. పెయ్యికపబడవట్టె, నీకో కొత్తచీరతెత్త మల్లబట్యాలకు పోల్లకుసూద్దాం. నేను వాంకిడి అంగడిబోయత్త ఇయ్యల్ల నువ్వు పోరి పనికిబోండ్లి-" అని మూసి మూసి

నవ్వులు నవ్వుకుంట సుట్ట మల్లముట్టిచ్చుకున్నడు. మల్కుబాయికి రంగు రంగుల చీరెల కండ్లముందు కన్పించినయ్.

అట్లా ఆదంపతులు బతుకుదెరువు ముచ్చెట్లుబెట్టుకున్నరు. ఇంకా ఎల్లబోసుకోని ఎన్నో బాధల్ని కడుపులో దాచుకున్నరు. కండ్లల్ల నీరు కారనీయలేదు. బతుకుమీద ఆశ బహుచిత్రమైంది.

సీకట్లను చీల్చుకొని కొండలనెక్కి సూర్యుడు బారెడంతరానే వచ్చాడు అయినా పొడుపలి ఇంకా వాళ్లను ఒదలనేలేదు.

చలిని తిట్టుకుంటూ శిత్రులేచి ఆవులించి ఒళ్లిరుచుకొని కొంకర్లు బట్టుకపోయిన కాళ్ల చేతులు జాడించాడు. చలిని తిట్టుకుంటూనే ముఖం కడుక్కున్నడు.

నిన్న ఇసిరిన గట్క మల్కుబాయి సీరెసంబరాన వండేసింది. ఎర్రిగారం నూరింది. పిల్ల, సిత్రు మల్కుబాయి తలాబుక్కెడు కడుపులేసుకున్నరు.

అప్పటికే ఉన్నబట్టల్లో మంచియిగట్టుకొని ఎంటికలు సరిదువ్వుకొని ఆడోల్లు అంగడి సంబురాన కూనిరాగాలుదీస్తూ, పొగాకు సంబురాన్నో, జొన్నల సంబురాన్నో మొగోల్లు కాల్లుఎగరేస్తూ అంగడిపోయే వాళ్ల పోతున్నారు. అంగడే వాళ్లబతుకులో పెద్ద వినోదకేంద్రం. వాళ్ల ఆశలు కలలు కొనుక్కొనేదక్కడే. బతుకు దోసుకోబడే దక్కడే అనేది వాళ్లిప్పుడిప్పుడే తెలుసు కుంటున్నారు.

"ఓర్నియమ్మ లారీలచ్చె. మోటర్లచ్చె. గాడీలచ్చినయటర" అన్నదెవడో తన తెలివి చూపెడుతూ.

బొంగుపని నడిచినంతకాలం అంగడి మొఖంచూడడానికే పీలుగాదు. బొంగులు కొట్టి కుప్పలుగట్టి లారీలకెత్తడం లారీలకోసం కొత్తపట్టి రోడ్లు కొండల కడుపుల్ల దాకా వేయడంతోనే సరిపోతుంది. పనిజరుగుతున్నప్పుడు సూపరవైజరే రేషన్ తెస్తాడు. ముక్కినవి మురిగినవి వాళ్లమొఖాన గొట్టి వానిష్టంవచ్చిన ధర గడుతడు. వాడియన్నీ చిత్రగుప్తుడి లెక్కలు. చిక్కులెక్కలు గోండోల్లకు తెలిసిసావయి.

బొంగుపనికి పోయేవాళ్ళు అంగడిపోయే వాళ్ళకేసి గుర్రుగా, బాధగా చూస్తూ పోతున్నారు. మల్కుబాయి బిడ్డనుతీసుకొని బొంగుపని వాళ్ళల్లో కలిసింది.

ఆలొద్దుల్లో వర్షకాలం తప్ప మిగతాకాలాలల్లో లారీలు దద్దరిల్లుతాయి. ఎనిమిది నెలలు అడివిలో ఏడచూసినా జనమే. ఆ ఎనిమిదినెలలు 'పటుకు పటుకున' గొడ్డండ్లు బొంగు నరికేసప్పుడు విన్పిస్తూనే ఉంటుంది.

"ఏం చేసత్తన్న-" శిత్ర అంగడిబోయే మందిలో కలిసిండు.

ం ం ం ం

కూలీలంత రోడ్డుపనిచేస్తున్నారు- అడ్డంగాఉన్న చెట్లు, తుప్పలు నరికేవారు నరుకుతున్నారు- బండలు పెకిలించేవాళ్ళు ముక్కుతూ మూలుగుతూ పెకిలిస్తానే ఉన్నారు. ఒక్కొక్కబండకు గూటనరాలు చిటపటలాడుతున్నాయి. మాగిన కుండ ల్లాంటి చెత్తల్లోంచి చెమటధారలు కడుతోంది. మట్టిమోసేవాళ్ళు మోస్తానేఉన్నారు- అట్లా పనిచేస్తున్నవాళ్ళ పనితీరుచూస్తే ఆకాశమార్గం కూడావేసి స్వర్గం చేరేటట్లున్నారు వాళ్ళు వాగులు, వంతలు, బొగడలు సాపుచేసి ఆరోడ్డు పడమటికొండ చివరదాకా వేయాలి. అట్లావేస్తేనే కొండమీది బొంగు లారీలకెత్తగలరు- ఒక్కొక్కగ్యాంగులో పది పదిహేను మంది పనిచేస్తున్నారు.

వాళ్ళు అట్లా ఉఎత్తైన పర్వతాల మీదిదాకా రోడ్లుమలిచారు- కొండల్ని లొంగ దీశారు- కొండల మీదినుండి తమ చెమటను, నెత్తురును కంకబొంగులల్లో కూరి లారీలకెక్కించారు- పొద్దస్తమానం వంచిన నడుమెత్తకుండా పనిచేయాలి- సూపర్ వైజర్ల కోరచూపులు- తన్నులు, తిట్లు, మరింకెన్నో పాడుపనులు జానెడుకడుపు కోసం సహిస్తూ శ్రమిస్తారు- అయినా తిట్లుతప్పవు- దెబ్బలు తప్పవు.

మల్కుబాయి తన కూతురుతోసహా దోబిగ్యాంగులో పనిచేస్తోంది- దోబి జిగి పచ్చిన ముసలివాడు- బండ పెకలించడానికి వంగినవాడు కాసంత ఆసర బట్టేసరికి వాడిముఖం కమిలిపోతుంది.

మల్కుబాయికి ఇవ్వాళ్ళ గాలిలో తేలిపోతున్నట్లుగా ఉన్నది- కడుపులో ఆకలి కన్నా ఆమె మెదట్లో చీరకదులుతోంది- చీరకట్టినట్టు కొంగు ఛాతీకడ్డంగాదీసి వెనక్కి చెక్కుకున్నట్టు-

"అరె! దోబిమామ జెర చెట్టుకింద కూకోరాదు-" అన్నాదెవడో-

ఆదే అదనుగా దోబి చెట్లగుబుర్లలోకి వెళ్ళిపోయాడు.

ఇంతలోనే దూరంగా జీబుఆగిన చప్పుడు- కూలోల్లల్లో సంచలనం- సూపర్ వైజర్ శర్మ జీబుదిగి రాజశేవితో కూలోల్లదగ్గరికొచ్చాడు.

"గుంటనక్కగాడత్తండు-" ఎవడో ఆదుర్దాగా భయంగా గొనిగిండు.

మొకద్దమ్‌ను పిలిచి "ఎందరు పనికివచ్చారా?" బొంగురు గొంతుతో నిర్లక్ష్యంగా అడిగిండు.

మొఖద్దమ్ మందినిచూసి పేర్లుచెప్పసాగిండు. శర్మజేబులోనుండి చిట్టాతీసి చూసుకున్నాడు. అడ్వాన్సుతీసుకున్న ప్రతి కుటుంబంనుండి మనుషులొచ్చారు కాని, జుగ్నాకబొజ్జు రాలేదు....

శర్మముఖం క్రూరంగామారింది- "నడువ్‌బే.... ఇద్దర్నితీసుకోపో పోయి వాన్ని ఈడ్చుకరాపో.... ఏమనుకున్నడో" అరిచిండు.

"వాని కంతు జెరం" అన్నాడెవడో శర్మ ముఖంచూడకుండానే.

"లం.... నకురాలు అడ్వాన్సుదీసుకోగా లేంది ఇప్పుడే వచ్చిందా ?" తప్పదని మొఖద్దమ్ మనుషులతో గూడెంకేసి నడిచాడు.

"పనిదొంగలు. గోండులం.... కొడుకులనమ్మొద్దు" తిట్లతో అక్కడివాతావరణం చెడిపోయింది

అప్పుడే నీల్లుదాగి చుట్ట ముట్టించుకొని ముసలిడోబి శర్మకంట బడనేపడ్డాడు.

"గోండులం.... కొడుకుల్లారా మీఅమ్మలు పుట్టేటప్పుడే సుట్టల్ని మిమ్మల్ని కన్నారా?" అని డోబిని తన్నబోయాడు. డోబి వనుకుతూ వంగి వంగి దండం బెట్టాడు.

అప్పటికి శర్మకు అలుపొచ్చింది. తిట్టుకుంటూనే గ్యాంగు పనితీరుచూసి విప్ప చెట్టుకిందికి చేరుకొని సిగరెట్టు ముట్టించాడు.

"ఆశమ్మ అదేంది ?" మల్కుబాయికి శర్మ తాగేదానిపేరు యాదికిరాలేదు.

"సకిలేటంటరుబాయి" అన్నాడుడోబి.

"అదిగది- సికిరేటుతోగన్నదేమొ ?" అన్నది.

నవ్వాలనుకున్న వాళ్ళు ఓపికలేక నవ్వలేకపోయారు. ఇక్కడ పనిసాగుతూనే ఉన్నది.

గూడెంవెళ్లిన మొఖద్దమ్ వలక్కిడిజంగు జ్వరంతో పాతగోనెసంచులకింద వనుకుతున్న బొజ్జును బతిమిలాడుకున్నాడు- పనిదాకావచ్చి సూపర్‌వైజర్‌కు మొక్కుదుపు రమ్మన్నాడు- బొజ్జును తీసుకవెళ్ళకపోతే జంగుకుతన్నులు- తనతన్నులు తప్పించుకోవాలంటే అట్లా వనుకుతున్న బొజ్జును శవంగానైనా మోసుకెళ్ళాల్సిందే. సూపరవేజర్ల ఖానూండ్లు కోపతాపాలు జంగుకుబాగాతెలుసు- ఇప్పటికి పదేండ్లనుండి ఇలాంటివెన్నో తను చూస్తూనేఉన్నాడు- అతని కళ్ళముందే ఎందరి వీపులమీదనో కంకబరిగెలు విరిగాయి- ఎందరో గిలగిలతన్నుకుంటూ మట్టిలోపొర్లారు- ఇన్నాళ్ల

బొజ్జువంతు- రేపు మరొకడు.... జ్వరంరాకమానదు- అందునా ఈ వనుకుజ్వరం అందరికీవచ్చేదే.... జ్వరంతోటి చావకతప్పదు. ఆ జ్వరానికి కారణం గోండులు పేన్కుకు కోపంరావడంగా నిర్ణయించుకుంటారు- దేవరకొలుపులు- కొలుపులకు అప్పులు- అది పుట్టనప్పుడు జాగా మంచిదిగాదని ఆ గూడాన్ని ఎత్తేసి ఆ నాలుగు కొండలమధ్యనే మరోదగ్గర మళ్ళా గుడిసెలువేస్తారు- చౌకిదారు ఒళ్ళుచీరుతాడు- దండుగలంటాడు. కోళ్లు ఎత్తుకపోతాడు.

వనికేసొజ్జును వెంటతీసుకొనివస్తున్న జంగు ఎట్లామెదులుకోవాలో చెప్ప కొచ్చాడు- బొజ్జుకు ఆమాటలు వినపడటంలేదు మార్గం కనబడటంలేదు- అంతా ముద్దముద్దగా కనిపిస్తోంది- తనను పట్టుకున్న చేతులవేడితప్ప మిగతాఅంతా చలి.... వనుకు.

ఆలిశ్యంఅయ్యిందని శర్మ వెర్రెత్తిపోతున్నాడు- ఆ ఆలిశ్యం మందుకు కావచ్చు- పజాచేయడానికికావచ్చు- అదే శర్మలో కంపరంపుట్టిస్తోంది.

అల్లంతదూరంలో బొజ్జునుచూసి ఉగ్రుడయ్యాడు. ఇంకేముంది పులి మేక పిల్లను చూసింది- బొజ్జు ఒళ్ళు హూనమయ్యింది. శర్మ గర్జించాడు. గాండ్రించాడు.

"ఎవడైనా అడ్వాన్సుతీసుకొని రాకపోతిరో ఇదేగతి మీకుపడుతుంది-" అని కిందబడిన బొజ్జునుచూపించాడు. గోండుభాషలోనే ఈమాట చెప్పింది.

కింద అచేతనంగాపడిఉన్న బొజ్జును అందరు చూస్తూనేఉన్నారు- కళ్లల్లో నీళ్ళు కళ్లల్లోనేఉన్నాయి- గొంతులోనిదుఃఖం గొంతులోనేఉన్నది. నిజంగావాళ్ళకు కోపం వస్తే సూపర్వైజర్‌ను రోడ్డుమట్టితో కప్పేవాళ్ళే- కాని రాలేదు. ఒకరిద్దరికి వచ్చిన కోపాన్ని దిగమింగుకున్నారు- అట్లాంటివాళ్ళల్లో మల్కుబాయి, ఆవిడకూతురుఉన్నారు.

బొజ్జును తీసుకవెళ్లమని జంగుకు సైగచేశాడు- జంగు మరోఇద్దరు బొజ్జును లేపుకొని చెట్లల్లో మాయమయ్యారు.

"బొజ్జుమామ పనికిరానన్నడా ?" పిల్ల అడిగింది.

"నీకెందుకుబాయి" డోబి గుసగుసగా.

శర్మ గడియారాన్ని చూసుకొని గ్యాంగుల కేసినడిచిండు.

"బొజ్జుమామకు జెరమచ్చిందా ?" మళ్లీ పిల్ల.

ఆపిల్ల కెవలు జవాబు చెప్పలేదు.

"పైసలిత్తె కొట్టాల్నా." మల్కుబాయి.

"కొట్టాల్నని ఏ ఖానూండ్లు రాసిండ్లు" ఇంకొకడు.

దాదాపు ఈ ప్రశ్నలు అందరు వేసుకున్నారు- వాళ్ళ గతజీవితాన్ని తవ్వి పోసుకున్నారు.

"తిట్లుతప్పయి- తన్నులు తప్పయి- మనబతుకు గింతే- బొంగు కట్టలు చిన్నగున్నయంటడు- సన్నటి బరిగెలే కొట్టిండ్లంటడు- పాసింగుల (బొంగు కట్టలు లెక్క పెట్టడంలో) సగం బొంగులు తీసేస్తడు-" బంటవత్తి రోడ్డుమీదవేస్తూ డోబి గొణిగిండు- పిల్ల నోట్లోకైదాకావంగిన డోబి నరిసిన మీసాలు కదలడం చూస్తోంది.

"సర్కారు జెప్పిన కూళ్ళన్న ఇచ్చెసొవడాయె" అన్నాడెవడో- ఈమాటకు వాన్ని అందరు చిత్రంగా చూశారు.

"తేల్లుంటయి బాయి- మెల్లగతియి." అన్నాడెవడో పిల్లనుద్దేశించి.

ఇట్లా వాళ్ళ బతుకులు తవ్వుకుంటూ రోడ్డుపనిచేస్తుండగా,

పెకిలించాల్సిన పెద్ద బండొకటి మిగిలిపోయింది. నలుగురు బండచుట్టుచేరి ఊపిచూశారు- కాని అది ఊగలేదు.

"రాండ్లెహెం రాండ్లి-" బండను పెకిలిస్తున్నవాళ్ళు మిగతావాళ్ళను పిలిచారు. అంతా పదిహేనుమంది బండచుట్టు మూగారు.

ఊపిర్లుబిగబట్టి "హైసా.... ఊం.... పట్టుండ్లిర- పట్టుండ్లి మల్కిబాయి కాలు జెగర్త-" మాటలతో అందరు ఒక్కుమ్మడి బండ పెకిలించారు.

అందరి కళ్లు బండమీదనే- కాని బండకింది రక్తపింజర (అతిప్రమాదకరమైన ఒకరకం పాము) మల్కిబాయి పాదంకేసి జరజర పాకింది- కాటేసింది.

"పురుగుముట్టిందిరో-" మల్కిబాయి కేకేసి దబ్బున కిందబడిపోయింది.

"చంపుండ్లి-" అరుపులు.

మల్కిబాయి నోట్లోనుంచి నురుగులు- శరీరం రంగుమారిపోయింది. పిల్ల మిడిగుడ్లేసుకొని పిచ్చిదానిలా తల్లిని చూస్తోంది.

అందరిలో భయం- అందరు మల్కిబాయిని చెట్లకిందనుండి మోసుకొని గూడానికి తీసుకొచ్చారు- పాము కరిసినచోట వాళ్ళకు తెలిసిన పసర్లుబోశారు- పరధాన్లవాడు మంత్రాలు పిటపిట చదువుతున్నాడు.

నాగురావ్ ఎటో ఉరికి పాములవాడిచ్చిన తేజాబు (ఆమ్లము) తీసుకొచ్చాడు.

అప్పటికే సంగతి తెలిసి శర్మ మంది దగ్గరకొచ్చాడు.

"అదేం బతుకుతుందిరా. మీరేదోమందుబోస్తున్నరు- పిసగోండోల్లు ఏదీ మందిటుదేండ్లి" అన్నాడు.

నాగురావ్ తెచ్చియిచ్చాడు.

శర్మ ఎడంచెయ్యి మట్టమీద పోసుకున్నాడు- ఉచ్ఛబడ్డది. మట్టంతా బుసబుస పొంగింది- లబడడిబడ మొత్తుకుంటూ, గొండోల్లను కసితీరా తిడుతూ గూడెంలో తానుండే బంగ్లాకు ఉరికాడు.

ఎన్నిపోసినా మల్కుబాయి మాత్రం చచ్చిపోయింది.

భయంకరమైన నిశ్శబ్దం గూడెంలో వ్యాపించింది. గూడెంగూడెం సడీసప్పుడు లేకుండయిపోయింది.

ఆకాశంలో చుక్కలు మల్లుబాయి పచ్చబారిన కండ్లలాగా భయంకరంగా ఉన్నాయి అంగడి నుంచి శిత్రు గూడెం చేరుకున్నాడు.

చనిపోయిన మల్లుబాయి శవం గుడిసెముందు. పిల్ల కడుపుల పేగులుబయట కొచ్చేలాగా ఏడుస్తోంది.

చీకటినిచీలుస్తూ గూడానికి దూరంగా చితిమండుతోంది- చితిమంటల వెలుగులు చెట్లకొమ్మలమీద ప్రతిఫలిస్తున్నాయి- పెద్దపెద్దడోల్లు మోగుతున్నాయి.

గొండోల్లు విషాదంగా నృత్యంచేస్తూ పాడుతున్నారు- చనిపోయిన తరువాత అట్లాచేయడం వాళ్ల ఖాయిదా (ఆచారం)

నిమ్మెకపాసి సిల్లేబాయి (నువ్వు సావలేదుబాయి)
జొకీరు కంపినీతూరే (సంపింది కంపినోడే)
నిమ్మెతోడివెడ్డివెకనే (నువ్వుమట్టిపొయ్యకుండా)
ఓనలారి తాకోబాయి (వానిలారి నడువబోదే)
నీవేపాపు లాక్పిబాయి (నీపాపంతాకివాడు)
ఓరుసాంతోదు కరలేబాయి (పత్తాడు సత్తెంబాయి)

ఇంకా ఇట్లాగే విన్నుచంపి నీపిల్లలకు విషంబెట్టాడనీ, వేరుగా స్వర్గం చేరుకోవాలని, దుష్టశక్తులేవీ నీ ఛాయలకే రావద్దని, తెల్లవార్లు పాటలుపాడుతూ డోల్లు వాయించారు.

శర్మ మాటిమాటికి పొక్కినచెయ్యి చూసుకుంటూ దిగాలుపడి కూర్చుండి గ్లాసుమీదగ్లాసు విస్కీతాగుతున్నాడు- అతనికళ్ళు మూతలుపడుతున్నాయి- డోల్ల చప్పుడు భయంకరంగా విన్పిస్తోంది.

ఇంకా చీకటి చీకటిగ ఉండగానే గోండుగూడాల కూలీలంతా సూపర్‌వైజర్ ఉంటున్న ఊరికివచ్చారు- ఊరంటే పెద్దఊరేంగాదు- రెండువందల ఇండ్లుంటాయి- ఆ చుట్టుపక్కల అదే పెద్దఊరు ...

శర్మ బారెడుపొద్దెక్కినంక లేచిండు- ముఖంకడిగి స్నానంచేసి టిఫిన్‌చేసి బయటకొచ్చాడు- అతని ఎడంచేతికి కట్టున్నది. కూలీలు చాలాదూరంనుంచి సద్దులు కట్టుకొని వచ్చారు.

అప్పటికి పదిహేనురోజుల పనిజరిగింది. గూడాల్లోంచి ఇంటికి ఇద్దరు ముగ్గురు కూలీపైసలు రావాల్సినవాళ్ళున్నారు. అక్కడికొచ్చినవాళ్ళు దాదాపు రెండువందల పై చిలుకేఉంటారు.

శర్మ లెక్కలుతీసిండు- అడ్వాన్సు ఇచ్చేటప్పుడు కూలి మొగకూలికైతే 4-50 ఆడకూలికైతే 3-50 పైసలుగా ఖరారుచేసిండు- ఇప్పుడు లెక్కలుకట్టింది మొగకూలికి 4 రూపాయలు ఆడకూలికి 3 రూపాయలు.

గోండోల్లల్లో గొణుగుడు షురువయ్యింది.

"గిది అన్యాయెం" అన్నాడు శిత్రు.

అంతా "కాదామరి" అన్నారు.

ఒకస్త్రీ తీసుకున్నడబ్బులు శర్మ ముఖంమీదకొట్టింది.

శిత్రు శివంపూనినవాడిలాగా పెద్దగొంతుతో "మమ్ముల ముంచుతండ్లు- ఇట్లయితే మేం పనులుచేసేదిలేదు-" మొత్తుకున్నాడు. అతని పిడికిల్లు బిగుసుకున్నాయి కండ్లు మండుతున్నాయి. అదెక్కడికోపమో శిత్రుకేతెలియదు. దోబి చిత్రంగా శిత్రు పిడికిలికేసి చూస్తున్నాడు.

"మీకు ఇంతకన్నా ఒక్క నయాపైస ఎక్కువిచ్చేదిలేదు- ఎక్కడ ఫిర్యాదు చేసుకుంటరో చేసుకోపోండ్లి" అంటూ నిప్పుతొక్కిన కోతిలాగా కాసేపుఎగిరి ఇంట్లోకి వెళ్ళి బట్టలేసుకొని బయటకొచ్చి జీబులోఎటో వెళ్ళిపోయాడు.

కూలీలంతా తలోవిధంగా మాట్లాడారు- సాయంత్రం దాకా శర్మరాగలడేమోనని ఎదురుచూశారు- తెచ్చుకున్న సద్దులుతిన్నారు.

సాయంకాలం శర్మ మరింకరాడని నిర్ణయించుకొని ఎవరి గూడెంవాళ్ళు పోతున్నారు. దారిపొడుగుతాతిట్లే-కొందరు ఊరుపేరు లేకుండా, మరికొందరు శర్మను పేరుపెట్టే తిడుతున్నారు

పైగూడెం సితిళాయి "మనం పదేండ్లబట్టి పేత్తనం అనుకున్న మాటమీద కూలీలెన్నడు ఇయ్యలే. అవి తాతసొమ్మా? ఆదేమన్న పుక్యానికిత్తండా? ఇత్తదో సత్తదో సూద్దాం. ఈపారి అనుకున్నకూలి యిచ్చేదనుక పనులకు వెల్లద్దు" అన్నది.

"నిచ్చమే నిచ్చమే" అన్నారంతా.

ఆ మందలో ఆడవాళ్లే ఎక్కువమందున్నారు.

శిత్రగూడెం చేరుకునేటాల్లకు రాత్రియిపోయింది. ఎవరూ ఇండ్లల్లోకి వెళ్లకుండా శిత్ర గుడిసెముందు పెద్దనెగడు బెట్టికూర్చున్నారు. "ఏమయ్యిందేమయ్యిందని" గూడెంలో ఉన్నవాళ్లు వచ్చారు.

నాగురావ్ ఏదో ఎర్రికాయిదం తెచ్చిండు. అతనికి కొద్దిగా చదవడంవచ్చు.

"ఎక్కడిదిరా కాయిదం" అన్నారంతా.

"ఇయ్యల్ల సంఘపోల్లచ్చిండ్లు. కంపినోళ్ళు మనల దోసేసంగతి చెప్పిండ్లు. ఇగో గీ కాయిదంలో సర్కారుచెప్పిన కూలిరేట్లుసుత ఇత్తలేరని రాసిండ్లు" అని తట్టు కుంట తట్టుకుంట కాయిదం చదువసాగిండు.

నెగడి మండుతోంది చిటపట - పటచిట- గోండోల్ల కండ్లుమండుతున్నాయి.

o o o o

అడివి నిశబ్దంగా ఉన్నది. బొంగుకోసమొచ్చిన లారీలు ఎక్కడివక్కడ ఆగి పోయాయి. లారీల డైవర్లు, క్లీనర్లు చెట్లకింద కూర్చుండి పత్తాలాడుతున్నారు. అడివిలో గొడ్డండ్ల సప్పుడులేదు లారీలు బుర్రిబుర్రిలు లేవు.

గోండోల్లు పనిబందుబెట్టారన్నవార్త శర్మకు మధ్యలోనే తెలిసింది. జీబును అటునుండటే పోలీసుస్టేషన్‌కు తిప్పాడు. "లమ్డికొడుకుల ఓసారి తన్ని సైగాని బుద్ధి రాదు." అనుకుంటూ లోపటచొచ్చాడు.

అమీన్‌కు తన చేతికట్టు విప్పిచూయించాడు. పుండింకా పచ్చిపచ్చిగానే ఉన్నది. గోండోల్లు, సంఘపోల్లుకలిసి తనను కొట్టారన్నాడు. ఏదోమందు చెయ్యిమీదపోశా రన్నాడు. పని బందుబెట్టారన్నాడు. చర్యతీసుకోకపోతే పాత్రిజాలే తీస్తారన్నాడు. కండ్లల్లో భయంతెచ్చుకున్నాడు. ఖర్చులకుండనీయిండ్లి అని అయిదువందలు తీసి అమీన్ జేబులో కుక్కాడు.

ఇంకేముంది! పోలీసులు గూడాలమీదపడ్డారు. కనపడ్డవాళ్ళనల్లా కసిగాకొట్టారు కనపడ్డ కోడిపిల్లను ఎత్తుకపోయారు. కనపడని సంఘపోల్ల గురించి అడిగారు.

"పొరకలసార్లను మీరుదాత్తండ్లు- మీఅందర్నీ తుపాకులుపేల్చి సంపుతం" అని బెదిరించారు.

గుడిసెలు తొక్కి, కుండలు తొక్కి, బొబ్బలేసి- చిలచిల నెత్తుర్లు కారంగ అందరినికొట్టి యమలోకాన్ని సృష్టించి చివరకు కొందరికి పగ్గాలుకట్టి పోలీసుస్టేషన్‌కు తీసుకొచ్చారు అందులో శిత్ర ఉన్నాడు.

శిత్రబిడ్డ వెంటబడ్డది- దోబి లార్య గుంజుకపోయింది.

ఇప్పుడు వాళ్ళకళ్లల్లో మల్కబాయి చితిమంటలు కనిపిస్తున్నాయి. ఇప్పుడు వాళ్ళకళ్లల్లో జ్వరంతో వనికిపోతున్న బొజ్జ కమిలిపోయినఒళ్ళు- ఇప్పుడు వాళ్ళకళ్లల్లో వందలసంవత్సరాల యమబాధలు గాయాలు, మచ్చలు. ఇప్పుడు వాళ్ళకళ్లల్లో పోలీసులు చేసిన దౌర్జన్యం రేపిన కోపం.

తెలుగునవలా సాహిత్యానికి ఉత్తమమైన సాంప్రదాయం, చరిత్ర ఉన్నాయి. కందుకూరి వీరేశలింగం, ఉన్నవ లక్ష్మినారాయణ, గుడిపాటి వెంకటచలం, కొడవటిగంటి కుటుంబరావు, త్రిపురనేని గోపీచంద్, రాచ కొండ విశ్వనాథశాస్త్రి మొదలైనవాళ్లు ఈ సాంప్రదాయానికి చెందినవాళ్ళు. ప్రజాజీవనాన్ని వివిధకోణాలనుంచి దర్శించి, ప్రదర్శించిన రచయితలువీళ్ళు.

ప్రజాజీవితాన్ని, పోరాటాల్ని సమర్థంగాచిత్రించే నవలలకు ఆదరణ ఎప్పుడూ ఉంటుంది. అటువంటి నవలల కొరతఉన్నప్పుడే అవాంఛనీయ ధోరణులు విజృంభిస్తాయి.

అభివృద్ధికాముకుల ఆదరణమీదఆధారపడ్డ హెచ్‌బిటి ప్రజాజీవిత, ప్రజా పోరాటాల చిత్రణకు ప్రాధాన్యమిచ్చే నవలలను ప్రోత్సహించే ఉద్దేశ్యంతో నవలలపోటీని నిర్వహించ దల్చుకున్నది. ఈనాటి సమాజంలో తెలుగుదేశపు ప్రజలబాధల, గాధలనుచిత్రిస్తూ వాళ్ళకు ఆశాజనకంగాఉండే సందేశాన్నందించే నవలలను బుక్‌ట్రస్టు తరపు నఆహ్వానిస్తున్నాము. ఇంతకుపూర్వం వెలుగుచూడని వర్గాల జీవన సరళిని చిత్రించే రచనలను ప్రత్యేకంగా ఆహ్వానిస్తున్నాము.

ఉత్తమ నవలకు మొదటి బహుమతి రూ. 2500/-, రెండో బహుమతి రూ. 1500/- ఇవ్వటానికి నిర్ణయమయ్యింది. రచన 1982 మార్చి నెలా ఖరులో బుక్‌ట్రస్టుకు అందాలి. పోటీకి సంబంధించిన నియమావళికోసం ఈ క్రింది అడ్రసుకు రాయండి.

చేకూరి రామారావు

హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, 3-6-694, హిమాయత్‌నగర్, హైదరాబాద్ 500 029.

# నరాలుపోగు

ఎన్నార్ 'భోలా'

పెద్ద ఊరెల్పుగడీ- గడీల నట్టనడుమ ఒక చిన్నయిల్లు- ఆ యింటిముంగట చెర్వెల్పువాకిలి. కుడిదిక్కు రొండు పాయకానదొడ్లు- గండ్ల అమ్మగారోల్లె బోతరు- ఇంకోలుబోవద్దు- ఆ దొడ్లకు ఈవలికని బాయి- బాయిపక్కపొంటి పెద్దచింతచెట్టు ఆ చింతచెట్టు కిందినుంచి ఇంటెన్క పెరట్లకుతొవ్వ- పెరట్ల మక్క జొన్నయేసిండ్లు- అండ్ల ఒక పాంపుట్ట- పుట్టమీన తీగెచెట్లు, కట్లపూలుగూడ వున్నయి. అక్కన్నుంచి ఎదుమపక్కకత్తె అక్కడ రొండు కుమ్మరిగోలాలు భూమిలపాతివున్నయ్- అవ్వి రోజు వాకిలిసల్లటానికి అలుకుకలిపె గోలాలు- పక్కన్నె అంపలి [1] మూతులుబెయిన కుండల్ల నీల్లువున్నయి- తలెలు చెంబులు గక్కన్నెకడుగుతరు ఆనీల్లు పెరట్లకు పోతయి. అంపలిపక్కపొంటి ఉప్పలమ్మగుడి- గుడంటె నాల్గురాల్లతోని ఇటోటి అటోటి ఎన్కోటి మీదోటి పొయ్యిమాదిరి పెట్టింది. అండ్ల పసుపు కుంకుమసల్లి దీపంముట్టిచ్చి మొక్కుతరు. ఆ ఉప్పలమ్మగుడిపొంట చిన్నమొండిగోడ- మొండి గోడకు వాసూరేసిన నూనెపీపాలరేకులు- ఆ రేకులకింద రొండు జంపుకాస్ల మొగ్గాలు.

పెద్దఎండల పెయిమీద అంగిలేకుంట పంచెబుడ్డజెక్కిన ఒకాయన చింతకింది మొకాన, గంజిలతడిపిన పరిజాపె వంకెన్లెక్కిచ్చి ఊడ్తికిబెట్టి, ఊడ్తికున్న పాతిన కొయ్యలకునడుమ దుప్పికొమ్ముగట్టి తాడుబిగిస్తుండు. నడుమ నడుమ సరిమీద లాక బద్ద [2] కొట్టుకుంట యీసన్నుంచిఆడిదాక ఉష్, ఉష్ అనుకుంట కుంచెబెడ్తుండు. సరి చిక్కుల్లేకుంట మేపోక్కాపోగు దువ్వినట్టుగ యిచ్చుకొని గంజిఆరుకుంట పులిపచ్చిగున్నది. గంజిబెట్టిన సరికి బయ్యాన ఈగెలు ముసురుతానయి. మల్లోపారి ఆ దుప్పికొమ్ముకాడ తాడుమీద కాలేసి తొక్కి బిగిస్తుండు- ఇగ సరి అరుతాంది- మనిషి ఆగమాగమైతాండు- చెమటలు గార్తానయ్- మల్లమల్ల, మల్లమల్ల! ఉష్ ఉష్ అనుకుంట కుంచెబెడ్తాండు ఆ కొసకు ఈ కొసకు ఉరుక్కుంట పనేరుతాండు- ఇగ ఆపని ఆపుతె సరంత యెండ్క పొయ్యి బిల్లగట్టపొయ్యి పనంత పాడయిపోతదని ఆయినె ఆపతి- గింతల ఇంట్లకెల్లి అమ్మగారువచ్చి "వారీ రాయరాం, అయ్యగారికి జిందాతిలసమూతు రాయాల్నో, కొంచెం ఇటాస్త్రిర మల్లబోదువుగని" పిల్చింది- అమ్మగారంటె ఆగడి వాల్లదె- అమ్మగారోల్ల ఇంటెన్క దర్వాజ గడీలకున్నది- రాయరామోల్లు గడినడుమవున్న చిన్న యింట్ల వుంటరు- అమ్మగారోల్లు బిల్సిండ్రంటె ఇగ మొగులు మీదబడ్డ ఆగేదిలేదు- అమ్మగారు పిల్చేటాల్లకు రాయరాం పిచ్చిలబడ్డడు- తొక్కులాడ్తాండు- "పెద్దోడన్న

పుంటె సరిజూసుకుంటడనుకుంటె లమ్డికొడుకు యెక్కన్నొ పెయిండు. యిగెట్లన్నా" అని పత్తాయించుతాండు. "యేందమ్మగారు, నేనత్తానపారాము" తొక్కనూరుతాన బక్కమల్లమ్మ రోకలి గోడకునిలబెట్టి జెప్పున రోలుకాన్నుంచిలేచి చిప్పల చెయి గడుక్కోని కొంగుకుతుడుసుకుంట వచ్చింది. "రాయరాంగాడైతెనె మంచిగరాత్తడని అయ్యగారు పిల్తాండు. రారాదుర రాయరాం, మల్లచ్చి పన్జూసుకోరాదుర యేంమున్గి పాయె. దా, దా!" అమ్మగారు ఇంట్లకు బోవుకుంట, తొవ్వలున్న బర్రెతలుగు కొయ్యకు జుట్టిరమ్మని చెప్పుకుంట పొయింది.

బక్కమల్లమ్మ రాయరాం భార్య, బుగులుపడ్తాంది. రాయరాంకు సరిని యిడిసి పెట్టి బోబుద్దయితలేదు. ఉచ్చితార్తంగ పసంత పాడయిపోతదని ఆరాటం, యెవ్వడు చేతికింద లేకపాయెనని కోపం, అమ్మగారుబిల్సె యిగెట్ల అని దుక్కమచ్చినట్టయింది. ఎటూతోచలేదు చేతులున్న కుంచె ఆడపారేసింది. దబదబ అమ్మగారెన్క ఉర్కినట్టుగ పొయింది. "లేకుంటేంది మరి, వాల్లు ఆయింత యింట్లకెల్లగొడ్తె యేచెట్టుకిందికి బోతం!" అని భయం. వాల్లవుండె ఆ చిన్నయిల్లుకు కిరాయిలేదు. అయితె ఆ యింటిసుట్టు ఊరెల్లు సాకిరుంటది. ఇంట్ల బోల్లుబొచ్చలు తోముడుంటది. పొద్దుగాల రాత్తిరి నీల్లుపట్టాలె. వాల్లకు నల్లవున్నది. తానాలగదికి, పాయకాన్లకు నీల్లుబెట్టాలె. అమ్మజాల్లు నింపాలె. ఉప్పు మిర్పకాయకు పొయిరావాలె. కాల్మొచ్చినా యేల్మొచ్చినా అర్సుకోవాలె. రాత్తిరి రాత్తిరి వడ్లుదంచాలె. యేదో పనున్నదని పక్కవూరికు పొయిరమ్మంటె పోవాలె. గందుకె కిరాయిలేదు. నాకు పనున్నదంటె కల్తద?

X X X X

"యేడికి పెయినవ్ర, అరేయ్ ఒర్ లమ్డికొడ్క.. చీర్లాకేదిర,[3] చీర్లాకేదిర చీరేత్త. వీనియవ్వసీ ... పో లంజకొడ్క పో! పెండకు బొయిరాపో!" మూడోడు శేకరిగాన్ని తిడ్తాండు రాయరాం. శేకరిగానిగ్గూడ యెరికె నాయిన అవ్వ యెట్ల కస్ట పడ్తాస్రొనేది. పొద్దుగాల్లేత్తెనె చీపురుబట్టి అవ్వనాయిన ఇద్దరుగల్సి గంటసేపు ఊడ్తరు. మొత్తం వాకిలంత సల్లటానికి రెండుతట్టల పెండబడ్తది. అటెన్క అమ్మగారింట్ల పెద్దిల్లు ఊడ్వాలె, అల్కాలె. గాదెలున్న అర్ర, వంటకునె అర్ర, మల్లెసాల, తడ్కలు సాటుగట్టిన చెక్కఅర్ర అన్ని ఊడ్సెటాల్లకు అయ్య నడుంటంగుమంటది. యాష్ట గుంటది. అవ్వ బండెడు బోల్లుదోమి కడిగి ఇంట్ల బోర్లిచ్చిరావాలె. మల్ల ఇంట్ల జూసుకోవాలె, గిదంత పన్నెండేండ్ల శేకరిగానికి యెరికె. నాయిన అవ్వకష్టపడ్తాండ్లని అనుకుంటడు. గంద్కనె నాయినతిట్టే తిట్లకు కొల్లుగొట్టుకుంటనె తట్టబట్టుకొని పెండకు

బోతడు. రోజు పెద్దరోడు మీదికిబోయి, వీటుతొవ్వల బండ్లునడిచే బాటల ఊరుపెట్టు బొయ్యి తట్టనింపుకత్తడు. రోజుకు రోజు నాయిన తిడ్తనేఉంటడు. పోనుపోననుకుంట తట్టబట్టుకొని పోతనేవుంటడు శేకరిగాడు.

వీటుమొకాన పెయినప్పుడల్ల బుజానికి సంచేసుకొని శేకరిగాని చిన్నన్న లచ్చిగాడు వీళ్లెకుబొయ్యి బండ్లపొంట కిందబడ్డ మెరపకాయలో, యెర్శెన్గెకాయలో యేరుకొని, లేకుంటె బండ్లల్లకెల్లి పెసర్లుగిన కొట్టేసి సంచులు నింపుకచ్చేటోడు. శేకరిగానికి గిన్నెన్ని యేర్శెన్గెకాయలు బెడితె పెండచేతుల్తోనె ఒల్చుకుంట బుక్కుకుంట తట్టబట్టుకొని తిరిగెటోడు.

లచ్చిగానికి యేదేండ్ల పోరనప్పుడు యేదో అయిందని రాయేశుని దేవునిపేరు మీద జన్నెకిడిసిండ్లు. అట్ల దేవునిపేరుమీద వుండెటోల్లకు చెవులకు రాగిపోగులు, పెయినిండరాగి నగలు, కాలుకు రాగిబేడి వుంటయి. సౌరంచేయించరు. లచ్చిగానికి శికెముడి యెంటికెలు. రాగెంటికెలోగ్గె ఎర్రిగుండి ముద్దలుగట్కపొయ్యి నెత్తిమీదికెల్లి పెడపట్టు తాల్లుతాల్లు యాల్లాడుతాంటయి. బట్టలుగూడ దుబ్బదుబ్బేనాయె. ఇగ వానవుతారం జూత్తెనె దయ్యంగూడ జడుసుకుంటది. గట్లుంటడు.

సంచుల్ల నింపుకచ్చుకున్నయన్ని అక్కన్నె ఓదుకాన్ల అమ్ముకొని సీన్మలు జూపెటోడు. ఇంట్ల అవ్వనాయిన తిడ్తాంటరు. వాడుకొద్దిగ యాల్లదప్పి యెనక్కస్తనే వస్తడు. యెవ్వలు లేన్దిజూసి యేసుకోనితింటడు. అవ్వ రాట్నమ్మీద కండెలు సుట్టుకుంట సూసుకుంట "కుక్కోల్గె కుండకెగబడి తింటాడు సూడు గాడ్డికొడుకు, అకూడు పెయికెట్లబడ్తాందిర, గింత గాయిదితిర్గుడు తిర్గుతాండు. వీనికి బుద్దెట్లత్తదో, యెవ్వడు జెప్పెటోడులేడాయె సేపెటోడులేడాయె. అన్నాలెం. గిట్లెట్లతిర్గబుడ్డయితందిర నీకూ! అయ్యో! చాచాచాచా!" తిట్టుకుంట సదుతాంటది. లచ్చిగాని పెయిమీది దేవుడు చెవ్వులకు అడ్డముంటడొ యేమొ గిదేమి పట్టిచ్చుకోడువాడు. తిన్నదంటె అయిపాయె చెంగోబిల్ల.

X X X X

"రాయమల్ల, కస బిర్రిబెట్టినెయ్యర. గది చటాకువజను తక్కువున్నాగని సాహుకారి బీస పన్నీన సూసుకోని యేసుకుంటడు. యెన్ని ఇకమతులబడ్డ సావుకారి ముల్లె నిండుతలేదాయె" అన్నడు పెద్దకొడుకుతోని రాయరాం.

"సీకేంది అనంగనెబపాయె. బుడ్డసన్నులునేసినట్టా? పల్లికట్టె[4] దీసి పల్కెపెటాల్లకు కడ్పులపేగులు నోట్లెకత్తానయ్. బిర్రిబెట్టంగనె కావద్ద. వనిదొక్కొటాన్కి

కొల్లుకీల్లు గుంజుకత్తానయ్- వనిదెర్వక వాడెసొర్సిక జారి మోకాళ్ళమీదపడి పొక్కలు బొడ్తాంది. యేదీ, ఆ సావుకారిగాన్నివచ్చి రొండుకండెలు నేసిపొమ్మను తెల్తది- రొండువాళ్లేసి రొండుపొర్ల పల్కగొట్టెటాల్లకు అయ్యగారి జబ్బలు జమిడికెలేస్తయి- గప్పుడుదెల్తది, కూడోనిసంగతి జంపుకాన్లసంగతి" అని అనుకుంటనె తాడుబిగిచ్చిండు. పెడ్డోలకాడ తాడు కిచ్రిమన్నది. డుబుక్ డుబుక్ మన్నదెబ్బ ఖటక్ ఖటక్ మని తాకు తాంది. పండ్లుబిగబట్టి వడిదొక్కి వంగి ఈపక్కనుంచి నాడేసి జనిగెత్తిర్గసాగి అపక్క నాడె అందుకొని సట్టరుగొట్టెటాల్లకు కండ్లల్ల నెత్తురువరాలు శేల్తానయి. దోస్గ5 డొక్కలం సొచ్చింది. 6 నెంబరునూలు ఒంటిపోగునేత ఎంతవు యెద్దడి- కొట్టికొట్టి నడుం టింగ్ మంటంది.

"ఇంతజేత్తె అడసేటు- ఇది దీలగున్నదంటడు- పజన్ తక్కువున్నదంటడు. సరిదేలిందంటడు- గిది గిట్లున్నది, గది గట్లున్నది అని వంకలుబెడ్తడు- పట్టుబడికాడ కూలికాడ కోశీసుజేత్తడు- ఊరుకంటె పనుక్కు పావుల తక్కువిత్తనంటడు- ఇంకో కాడికి బోదామంటె జమానతుగావాలె- "మాలు నీకెవడు నమ్మిత్తదారి!" అంటరు- ఇంత బజాట్ల పతారబుట్టిచ్చుకుంటె ఇంట్ల నేపెదిక్కులేదాయె-" అనుకుంటాంటడు రాయరాం- ఎన్నడు సక్కగ నెయ్యడు రాయమల్లు- "నేత్తెంలాబమున్నది, తిన్న దర్గవోడునెయ్యాలె" అనెటోడు- ఇగ లచ్చిగాడు ఇప్పుడిప్పుడె మొగ్గంనేస్తుండు- గని ఆ పెయిమీది దేవనిరూపం ఇసుకుబుట్టిచ్చేది- చికాకుపడేటోడు- లేసిఅవుతలబడెటోడు.

X X X X

అంబటాల్లకు మొకంకడుగుతాన బక్కమల్లమ్మ యింటెనక్క మక్కపెరడు "తన చేతుల్తో ఇత్తులేసి, పెరడుకలుపుతీసి పాదులుమెత్తి పొతంజేత్తె ఒక్కకంకి యిరుసుకునె దైర్నంలేదాయె- ఏంబాగ్గెం" మన్పులగునుస్తొంది- మక్కపెరడు సుంకులు బెడ్తాందని సూత్తాంది (గది అమ్మగారోల్లది) గింతల "రాయమల్లడు బువ్వ కచ్చిండె" అన్నడు రాయరాం మొగ్గంమలగట్టుకొని ఎర్రిమన్నుతోని అచ్చన 6బెట్టు కుంట- దబదబ గిన్నన్ని నీల్లుపుక్కిలిచ్చి ఊంచి చెయితుడుసుకుంట వచ్చింది బక్క మల్లవ్వ- అందరు ఏటోన్ని తింటరుగని పెద్దోడంటె మల్లవ్వకు బయం- తలె మల్లమల్ల కడిగిపెడ్తది- ఇంట్ల ఎక్కడ తలెపొందది- అన్నీ గుంటలే- ఇంట్ల ఎవ్వలకన్న దగ్గు పడిశెం జెరం యేదన్నగాని రాయరాం యిసురాయితోని ఇంట్ల "వల్లు" బడ్తడు- "దేవుడా నీబాంచెను, నీ మాయుంటె గట్టిగ బట్కవాలె లేకుంటె పువ్వోలె లేవాలె" అనుకుంట విలబెట్టిన యిసురాయిని లేబట్టుకుంట ఎత్తేస్తొంటడు- అవ్వే గీ గుంటలు.

రాయమల్లు దర్వాజలకెల్లి కొద్దిగతల్లాయెవంచి లోపటికొచ్చి అడ కాల్లమీద కూసున్నడు- బక్కమల్లవ్వ తలెలబువ్వేసుకుంట "లచ్చిగాడు దేవునిపేరుమీద గట్లదిగ్గవట్టె- పెరొక్క గుడ్డవేసినా అయ్యకింత ఆసరగాదుర- ఒక్కడు ఎన్నిదక్కుల పాతులాడ్తడు- మలేసుకుంటె కుంటెబెట్టె దిక్కులేదాయె- ఇగమీరు కొడుకులు వుండెందుకు లేకెందుకురా- అన్నాలం ఒక్క వాటెయ్యకుంట తెల్లారేత్తెనెమెగ్గం జాప్తిరి పోతిరి- ఎట్లరగిట్లయితె అం" కూరేసి మంచినీల్లుబెట్టి ఆకుండిటు ఈ కించు దటు సదురుకుంట, ఓపారి పొయ్యికాడికిబొయి కొర్కాసులమీద నీల్లుజల్లి అటిటు దిరుక్కుంట జెప్తంది. రాయమల్లు తింటనేవున్నడు- కుంయ్‌లేదు కంయ్‌లేదు. రొండు నిమిషాల్ల తిన్నడు దోత్తోని మూతితుడుసుకుంట పోనేపోయిండు.

"తోడేలుమీదబడ్డట్టు ఇంట్లసొచ్చి తిన్నడు పోతండు- గిట్లున్నదిపిల్లకత" కదురుమెకొనసూసుకుంట కండెపోసుకుంట అనుకుంటాంది. ఎర్రికండెలు గావాల్నని రాయరాం పిలువంగనె "అరె శేకరిగ గీ కండెలు సాయినకియ్యిబిడ్డ"అని బడికి పొయ్యొస్తాన శేకరిగానికి ఇచ్చింది. "అరెయ్ అప్నెగిన్నన్ని ఊకె లేర్కరాబిడ్డ" అన్నది. వాడు సంకలవయిలు రాట్నంకాడబెట్టి కండెలు అయ్యకిచ్చి "నాకెర్కలెపో నేంబోవాలె, సార్జెప్పనదమ్మన్నడు- బువ్వెయ్యి"అని గార్వంగ అక్కడి గుంజ కొయ్యను కొట్టుకుంటఅన్నడు- "ఇగ వాల్లుజేసిందుర్రి నువ్వుజేత్తవనిఆశార, గిన్నన్ని ఊకెలేల్లరారకుంటె అబ్బ పీక్కశెరెత్తం సల్లగుండ ఒక్కడు ఒక్కసార్గం ఇంటెన అప్పలు గింతశెవునబెడ్తలేరు" అనుకుంట రాట్నంమీదికెల్లి లేచింది బక్కమల్లమ్మ.

దర్వాజలకెల్లి అమ్మగారు పిల్చింది "బక్కమల్లూ, కసింత గిటురాయె, మా యింట్ల ఇయ్యాల పెర్గుతోడ్కలేదె- అబ్బాయి జనయ్య బడినుంచి వచ్చిండు- కొంచెం పెరుగు తెచ్చిపెట్టాల్నె- జెప్పన బోదువుగని ఒక్క నిముషం ఇటురాయె" సగం తెరిసిన దర్వాజలకెల్లి గింతంతమొకం ఇవతలికిబెట్టిపిలిచి లోపలికిబోయింది అమ్మగారు "నాకు జెప్పన బువ్వెయ్యే నేంబోవలె" కాల్లుకొడ్తాండు శేకరిగాడు- "అగరాదుర నువ్వోనివి- అవుతల అమ్మగారు బిల్తాంది" అనుకుంటపోయింది.

శేకరిగాని చిన్న మనుసుల యెందుకో అమ్మగారంటె కోపంవుంటది. ఎప్పుడు జూసినా అన్ని వాల్లపనులె- గారాత్రి గుడ్డిదీపంకాడ గింత పదువుకుందామనెటాల్లకె, "వారీ శేకరీ, బర్రెకు తవుడెయ్యాలార్రి, ఒక్క నిమిషం ఇటచ్చిపోర" అని పిల్తది. ఆమె పెద్ద గుండుచెంబెడు పాలుబిండెటాల్లకు ఇంకోలింకోలయితె మూడుసోల్లతవు డొడ్తది- గదె శేకరిగాడేత్తె బర్రెమూతి అగకుంట బుక్కలకు బుక్కలు మింగకుంట

బర్రెపిసూతికాడి గిన్నెల చిన్న పిరికిడితోటి పిరికిడి పిరికిడి తవుడుయేత్తడు- ఒక్కనోడు తవుడుపాల్తది పీడేత్తె. అందక్కనె అమ్మగారు ఎప్పటికి పీన్నేబిల్తది- తెల్లార్లేవంగనె బర్రెను మందకుగొట్కపోవాలె- చీకటిబడంగ రాంగనె బర్రెను గుంజకుతలుగుతోని కట్టెయ్యాలె- వాసూ కింద గడ్డివుంటది, అదింతతెచ్చెయ్యాలె- గిట్ల చానపనులు జెప్తది- ఎప్పుడన్న శేకరిగాడు మూతిటు ముక్కటుబెడ్తె యేంటిటొ వడియందెచ్చిచ్చేది. వాడు గదియ్యంగనె చాటంతమొకంజేసుకొని ఇగిలిచ్చెటోడు.

* * * * *

జంపుకాన్లునేసే కూలీలకు దుకాన్దార్లు నూరు ఇనూ్నరుసనుగులు పట్టుబడి జెప్పితరు. మొత్తం నూరుసనుగులకు 20 పైసల మాలుపడ్తది. కాని దుకానాలసేట్లు "18 పైసలేయిస్తం, గండ్లనెచెయ్యాలె"అంటరు "గండ్లెల్లెత్తయి బొంచెను, మాకుఅండ్ల ఏమి ఒక్కనూలుపోగువుండది. మీరుగిండ్ల కోశీసుజేత్తె మేం యెట్లనెయ్యాలె చెప్పుండ్రి- అంతలావైతె మా కూలిల తక్కువజెయ్యండ్లి"అని నూరుసనుగులకు మునూ్నరురూపాయిలు నికరమయిన కూలిని తమకుతామే తగ్గించుకుంటరు కూలీలు. మాఋతెచ్చుకుంటరు- నేసిస్తరు- ఎన్నిసనుగులు నేసిఅప్పజెప్తె అన్నిసనుగుల కూలి పైసలు మాత్రమే ఇస్తడు సేటు.

వానకాలం, సలికాలంల గిరాకియెక్కువ- అందుకని ఎండకాలంల సరుకు తయారుచేయించుకొని నిలువజేస్తరు. ఏరోజుకారోజు సాయింత్రం దుకానంసేట్లు గుమస్తాలను ఇండ్లల్లకుబంపిచ్చి సనుగులు తెప్పిచ్చుకుంటరు- లేకుంటె తాగుబోతు కూలిగాండ్లు సనుగులు ఇంకొకరికి అమ్మకబొబ్బుతరనిభయం. పట్టుబడి జెప్పిన ఇల్లిల్లుతిరిగి "సేటు సనుగులుతెమ్మంటాండు" అనిచెప్పి జరూరతుమీద దుకాన్లలేని సనుగులు జమజేస్కత్తడు గుమస్తా- ఇట్లపొయినప్పుడు ఆ గుమస్తా సేటుదగ్గర తిన్న తిట్లన్ని నెమరేసుకొని, ఇక్కడ కూళోల్లమీద తాను ఒకసేటులెక్క అవ్వేమాటలు రుబాబుగ మాట్లాడి నాకేందక్కువ అనుకుంటడు- ఆదీడనూడేసిన సనుగులు ఆరోజు నేసియ్యని కూలోన్నిబట్టి "ఇయ్యాల నువ్వు ఒక్కసన్గన్న ఇత్తలేవు- నాకెర్కలె- సేటుదగ్గరికి నువ్వేవచ్చిచెప్పుకో- నేంబోతాన- ఇగో వచ్చేటప్పుడు గీ సనుగులు గూడ తేవాలె- ఎర్కైనా- నేనైతెబోతాన"అని అంటగట్టి పోతడు.

ఆనాడు రాయరాం మర్దలుకు జెరమచ్చిందంటె చూసిరానుపెయిండు- నేసుడు కాలేదు ఇయ్యాల రాయరాం నెత్తిలబడ్డయి జంపుకాన్లు.

మూడోడు శేకరిగాన్ని ఎంబడేసుకొని మొత్తం 40 సనుగులను రాయరాం 25, శేకరిగాడు 15 తాల్లతోని గట్టిగ కట్టగట్టుకొని నెత్తినెత్తుకొని బజారునబడ్డరు. నడు

స్పాంచె శేకరిగాని నెక్కరుజేబులున్న దోసెడుగోలీలు గల్లర గల్లర సప్పుడయితానయి ఆ గోలీల వజనుకు నెక్కరు వంకరదిరుగుతాంది. ఒకచేత్తోటి నెత్తిలమూట పట్టుకొని ఎగిరినట్టుగ ఎగేసుకుంట ఇంకో చేత్తోటి నెక్కరుసక్కగ తిప్పు కుంటాండు. నెత్తిలున్నమూట ఎత్తేసినట్టు ఎగిరిపడ్తాంది. మూటకుగట్టినతాడు నెత్తికిఒత్తుకపొయ్యి నొప్పిబెడ్తాంది. "అన్న-అన్న" అంటాండు నొప్పికి- ఊకె లాగుసవరిచ్చుకుంట మూటసవరిచ్చుకుంట నెత్తిలమంటకు "ఉస్"అని లోపలికి పీల్చుకుంట నడుస్తాండు శేకరిగాడు. "ఏందారి, అటూఇటూ ఎగురుదెందుకుర, ఊకె సక్కగనడ్వలేవ్"అని శేకరిగానిదిక్కు చూసుకుంట నడుసుకుంట అన్నడు రాయరాం నడిజాట్ల బొందలున్నయి. చూసేసడ్తాండు- బొందలున్న సందిలేసి కాల్లల్ల మెదిలింది- నెత్తిన మూటెత్తుకున్న రాయిరాం తత్తరపడ్డడు, బోర్లాపడ్డడు. మూట బురద గుంటల పడ్డది- "అయ్యయ్యయ్యో! సన్గులన్నిపాడాయె- బంగారమసొంటి గుడ్డలు- చా చా చా చా!" అనుకుంటలేసి బట్టలన్న దులుపుకోకుంటనే సనుగులదగ్గరికి బోవు కుంట "సక్కగనడ్వర అంజెకొడ్తాఅంటె వీడు నకమొకాలునడ్తాండె"అని శేకరిగాని వీపుమీద వాటమైన పరుపునచిసిండు. వాడు అంతదెబ్బతిన్నా యేడువలేడు- జరిగిం దానికి దిక్కుమొకంబెట్టి "నేనేంజేసిన"అన్నడు- రాయరాం బుర్దలబడ్డ సనుగులమూట లేబట్టి ఆ పక్కన ఒక అరుగుమీదబెట్టి అన్ని ఒక్కొక్కటి దోత్తోటి తుడుసుకుంట, నడుమ నడుమ "అయ్యయ్యో చాచాచాచా" అనుకుంట మల్ల జమాయించి కట్టిండు.

దుకాన్ల సేటు యేమంటడో యేమొ అని గుబుక్కుంట పెయిండ్లు. దుకాండ్ల సేటు ముంగట దించిండ్లు- సేటు ఎవల్తోనో మాట్లాడ్తాండు. యెన్నీలోలె తెల్లగ లైట్లు యెల్గుతానయ్. మూటదించి పక్కపొంట దొడ్డికాల్లమీద కూసోని రెండు చేతులు పప్పుతి బట్టుకున్నట్టుగ పెట్టి మొకం డీలపడి సేటు ఇటుమొకాన ఎప్పుడు జూస్తడో అని మిటమిట జూస్తాండు రాయరాం. శేకరిగాడు కాల్లయేల్లమీద నిలేసిన మడిమెల మీద కూసోని మూట మీద చేతులేసి మూట తాల్లను సవరిచ్చుకుంట- అక్కడక్కడ మీదికెల్లిన పోగులను వడి తాల్చుకుంట కూకున్నడు.

"ఆఁ ఏమిటండీ రాయరాంగారు ఇలా దయచేశారు- సంగాలు బెట్టినవ్రి? సావుకార్ల సంగతి జూస్తరటగద- ఆఁ ఊరేగింపులు బహిరంగసభలు అబ్బో! మీకేంటయ్యో- మేదో ఓ కంట సూడుండ్రి మమ్ముల" సేటు రాయరాంతోని ఎక సెక్కెలాడ్తాండు. ఆరోజు ఊరేగింపు ఉన్నదని కరపత్రిం యెల్లింది- దేశంల ఉన్న అందరితోనిపాటు నేత కూలీలయి గూడ రెండు ముచ్చట్లు రాసిండ్లు అండ్ల. గందుకె సేటు క్యారెడ్డాలాడ్తాండు.

"నాకేం దెల్వది బాంచెను- ఇయ్యాల పనిగాలేదు మన్నుగాలేదు- శని నెత్తిం గూసున్నట్టయింది- దండంబెడ్తనయ్య."

"ఎట్లయితదిర, సంగాలాయె మీటింగులాయె- పనెట్లయితదిర- మీకు గండ్లనె బతుకుదెరువున్నదిర- పొండ్లి- యెవడెక్కడ బోతె మాకేందిర మా మాలు మాకు ముడితె అయిపాయె."

"గట్లెట్లయితది బాంచెను- పొద్దుగాల లేత్తెనె మొగ్గాలసొచ్చి వాటెన్కవాటు యేతెనె యెల్లుడు తిప్పలాయె. మాకు మీటింగులేమెరుక- రేపట్నుంచి కాడ పోకుంట నేశిత్త బాంచెను- ఇగో జంపుకాన్లు దీస్కోన్రి."

సేటు జంపుకాన్ల కట్టమొకాన సూసిండు. అంత బురద మరకలు- గలీజు గున్నయి- నోరుదెరిసి సూత్తాండు.

"వత్తాంటె తొవ్వల" ఇంక రాయరాం ముచ్చట పురాగ చెప్పకముందె-

"ఏందాని, అరెయ్- ఇవ్వి జంపుకాన్లా ముట్టు బట్టల్రా.... ఇవ్వి యెవ్వడన్న యే తల్కాయెలేని లంజకొడ్కన్న కొంటాడని.... నీ మొకానికి యాల్లకు సగ్గుల్లెయ్యవ్, తిస్కరార అంటె బుర్రలేస్కత్తవ్- బాగ సుకమచ్చిందిర మీకు- బంచొత్ బాడ్కావులకు కొవ్వుపెరిగిందిర మీకు- పో తీస్కపో లంజకొడక గ బురదలేసిన జంపుకాన్లు మాకెందుకురా- లే, నడువ్- నీయవ్వనీ...." యెట్లబడ్తెఅట్ల తిడ్తాండు సేటు. శేకరిగాడు యింటాండు- వానికేమైతాందో వానికేతెల్తలేదు. మూటగట్టిన తాడును యినుకుంట చెయితోని బిగిత్తాండు, బిగలాగుతాండు. గుంజీగుంజీయిడిసిండు. "డుబుక్క"మన్న సప్పుడయింది. సేటుఒక్కపారే యిటుజూసిండు. పోరడు లోపల్లోపల్నే పండ్లుకొరుకుతండు. "లేదుబాంచెను- నేను మంచిగనేవత్తాన, పంది పాడుగాను కాల్లల్లమెలిగింది. నేంబడిపెయిన- ఇగజూడుబాంచెను మోకాల్లు" చూపెట్టిండు- అసలు రాయరాంగూడ గప్పుడే చూసుకున్నడు నెత్తురెల్తాంది- దోతికరత నెత్తురు మర్కలయినయి. మోచేతులకు రాక్కపొయింది. అయినా గివన్ని లెక్కబెట్టకుంటనె బతిలాడుకుంటాండు.

"వారీ రాయరాం, నాకు గివన్నిజెప్పకు- ఇంకోలింకోలైతె యిర్గదన్నిత్తును- నువ్వు పెద్దమనిషివి- వాడుపోరగాడు- నేనైతె కోపంమీదున్న- ఏంజెయ్యాల్నొ ఎట్లుంటదో నువ్వేసూడు."

"నిజమే బాంచెను, తప్పయింది- ముసలిముండకొడుకును సెమించాలె బాంచెను- నన్నేంజెయ్యమంటె అదేజేత్త- గవి గీసనుగులు తీస్కోండ్రి- దండం బెడ్త- కాల్రెక్కలుడిగినోన్ని, దయజూపుండ్రి- మీరెట్లంటె అట్లనె- దేవునసోంటోల్లు- మమ్ముల జెర సెమించాలె బాంచెను" ఇగ ఒకటె మొక్కుడు మొక్కుతాండు, కాల్లుబట్టుకో బోతాండు. భూమికి చేతులుఆనిచ్చి మొక్కుతాండు.

ఇట్ల కొంతసేపయినంక సేటుకొద్దిగ మెత్తబడ్డడు- "అరెయ్. లె! నీయవ్వ నీ ముసలోన్ని....ల్లె!- అన్నిమొత్తం యెన్నిసన్గులార్రి!" కిందికిమీదికి అటుయిటు చూస్తుంట అడిగిండు సేటు.

"40 బాంచెన్" యేడ్పుస్వరంతో.

"అయితె 40కి (నాల్గుమూళ్ళ పన్నెండు అని లోపట్లోపల గునించుకొని) 120 రూపాయిలు కోస్తావి తీసుకుంట లేనంటవు నువ్వేతిస్కపోలె- ఇక్కడ లొల్లిపెట్టద్దు- ఊఁ లే!"

"ఓసేటో, నీకాల్మొక్త- దండబెడ్త అవ్వెనాయిగూడగావు మొస్కచ్చినందుకు మీదేత్తాండ్లు- గింతఅన్నాలెంజెయకుండ్రి- పొల్లగాండ్లు కూటికిసత్తాండ్లు- సేటూ నీ బాంచెను, నీపియిదింట-" బావురుమంట యేడ్తాండురాయరాం- కోతిమాదిరిగ కిందికి మీదికి దండాలుబెడ్తాండు. సేటు అరుగుమీది పరుపుమీదనె అటుయిటు తిరుగుతాండు- ఆయినె కాల్లుబట్టుకోబోయి మల్లోపారిపడ్డడు రాయరాం. శేకరిగానికి అయ్యను జూత్తాంటె గుడ్లల్లనీల్లు గుబగుబదున్కుతానయి- అయ్య పడంగనె వాడుసటుక్కు లేచి నిలబడ్డడు సుట్టు అంతకలియజూత్తాండు.

ఈలోల్లికి ఇంకో పక్కదుకానంసేటువచ్చి, "ఏదోపాపం పోనియ్యరాదు- 15 సనుగులైతె మంచిగనె వున్నయిగద- ఇగ ఆ 25కి 75 రూపాయిలుకోసుకో- పోనీపాపం ముసలోడు యేడ్తాండు- లేర ముసలోడా- యేంపనార్రియిది ఆఁ! లెలే!" మద్యవర్తితీర్పు జెప్పిండు.

"అయ్యా, గిదిఅన్యాలం, అన్యాలం "ముసలికన్నులకింద బొక్కలెల్లిన బుగ్గల గుంటలనుంచి కన్నీల్లు జారిపోతానయి.

"అగో ఇన్నావయ్య, పీనికాపురం- యేదో నువ్వుజెప్పినవుగద అని ఇంటా మనుకున్న- కని వానిమాటవాడే" సేటు.

"లేపే రాయరాంవన్న సేటుజెప్పితె ఇనాలె- కాదంటెమరినడ్త ద- ఎట్లనో అయింది. తప్పుదండుగ" ఇంకోకూలన్న లేబట్టిండు.

చిన్నపోరనిలెక్క యేడ్సుకుంట కొడుకునుతిస్కోని దుకాండ్లకెల్లి బయటి కచ్చిండు.

బజార్ల కొచ్చెటాల్లకు దూరంనుంచి మంటలు కదిలివస్తున్నట్టుగ కన్పిచ్చినయ్. కండ్లు తుడుసుకుంట చిత్రంగ చూస్తుండురాయరాం. ఆ మంటలు ఇటుదిక్కేవస్తున్నాయ్ అడనే నిలబడ్డడు. అది కాగడాల ఊరేగింపు- ముందట పెద్ద బంగ్లంతయెత్తున రెపరెపలాడుతూ పెద్దజెండ- లైట్లయెలుగుల రెపరెపమెరుపులు మంటల్లాగనె వున్నయి. ఆ జెండకింద ప్రతొక్కలచేతిల మంటలు- ఆ మందిల గుడ్రింగనిలబడ్డోలు పాటలుపాడ్తాండ్లు.

పాటయింటాంటె రోమాలు గొగ్గరిస్తానయ్- రాయరాం పాలివోయినమొకం తేరుకున్నట్టుగయితాంది బక్కదవుడల్లకెల్లి పండ్లుకొరుకుతానట్టుగ తెలుస్తుంది. ఊరేగింపు బహిరంగసభకు వోతాంది అందరిచేతుల ఉన్నట్టుగ రాయరాంచేతిల దివిటీలేదు. చేతబట్టుకున్న కొడుకే దివిటీగ ఊరేగింపులో కలిసిండు.

ఈ కథలోవచ్చిన వృత్తి పదాలకు అర్థాలు-

1. అంపలి : కంచాలు బోల్లు కడుగుకొనడానికి నిర్దేశించినస్థలం.
2. లాకబద్ద : కొంచెంవెడల్పుగా ఉండునట్లుగా చీరిన వెదురుబద్ద.
3. చీర్లాక : సన్నగాచీరిన వెదురుబద్ద.
4. పల్లికట్టె : దోస్గకు అడ్డంనిలువులలోవున్న రంధ్రాల్లోదూర్చి దోస్గనుతిప్పి బిగించడానికి ఉపయోగించే కర్ర.
5. దోస్గ : నాలుగు పలుకలుగావుండి నేసిన జంపుకానను చుట్టేసుకునేది.
6. లచ్చన : జంపుకాన వెడల్పు మించివోకుండా వుండేందుకు పెట్టేగుర్తు.
7. ఊశె : కండెలు చుట్టడానికి రేకుతో మలిచిన గొట్టం.

నడుస్తున్న చరిత్రపుటల్లోంచి :

# పోలండ్ కార్మికోద్యమం

కె. బాలగోపాల్

పోలండ్ కార్మికఉద్యమం 1955లో ప్రారంభమై ఇప్పటికి మూడునాలుగు వెల్లువలను చూసింది. 1956లో ఒకసారి, 1970లో రెండవసారి, 1976నుండి నిరంతరమయిన అలజడి, మళ్లీ 1980 ఆగస్టునుండి సాలిడారిటీసంస్థ నాయకత్వాన దాదాపు సంవత్సరంన్నర పోరాటంనడిచాయి. చివరిదశ, 1981 డిసెంబరు 13న ప్రధానమంత్రి జారుజెల్స్కి విధించిన సైనికపాలనతో ఒక కొలిక్కివచ్చింది. ఇకముందు ఏంజరగబోతుందని ఊహాగానాలు చేయడంకంటే, ఉద్యమాన్ని అర్థంచేసుకోవడంముఖ్యం

ఇక్కడ రెండుపొరబాట్లకు అవకాశంవుంది. ఒకటి, ఆఉద్యమాన్ని రివిజనిస్టు దృక్పథంతో అర్థంచేసుకోవడం, రెండు దానిని ఉదారవాద దృక్పథంతో అర్థంచేసుకోవడం. ఉద్యమాన్నిగురించి అందేసమాచారం అంతాగూడ సోవియట్ అనుకూల పత్రికలనుండో లేక పాశ్చాత్య పత్రికలనుండో రావడంవల్ల, ఈ రెండుపొరబాట్లలో ఒకటి చేయకతప్పడంలేదు చాలామందికి. సోవియట్ అనుకూల పత్రికలది రివిజనిస్టు దృక్పథంఅయితే, పాశ్చాత్య పత్రికలది స్వతహాగా ఉదారవాద దృక్పథం కాకపోయినా, ఉదారవాదులను ఆకట్టుకునే పదజాలం, సిద్ధాంతాలు, అవిచాలా తెలివిగా ప్రయోగిస్తాయి.

ఈరెండు పొరబాట్లూ చేయకుండ స్పష్టమయిన మార్క్సిస్టు దృక్పథంతో ఆ ఉద్యమాన్ని అర్థంచేసుకోవడం ముఖ్యమయినసమస్య.

పాశ్చాత్యపత్రికలు, వాటిని అనుసరించే మన దళారీ బూర్జువా పత్రికలు ప్రచారంచేస్తున్న అవగాహన ఈ విధంగానడుస్తుంది :

1. పోలండ్‌కు, రష్యాకు, తరతరాలుగా విరోధంఉంది. ఆధునిక పోలండ్ చరిత్రలో అధికభాగం జారిస్టు రష్యానుండి తన్నుతాను కాపాడుకునే ప్రయత్నంలో గడిచింది. అక్కడ సోషలిజంగూడ స్టాలిన్‌సైన్యాలు నెలకొల్పినదేకాబట్టి, పోలండ్ ప్రజలదృష్టిలో సోషలిజంఅంటే రష్యాఆధిపత్యం. ఇప్పటి కార్మికోద్యమంగూడ రష్యా వ్యతిరేక తిరుగుబాటు 2. అసలు సోషలిజం పోలండ్‌ప్రజలకు ఇష్టంలేదు. ఎందుకంటె, సోషలిజం అసలు ఏ ప్రజలకూ ఇష్టంవుండదు. కాబట్టి (ఎవరో ప్రాచ్యమూర్ఖత్వంలో మునిగిపోయిన చైనావియత్నాం రైతులను మినహాయిస్తే), పైపెచ్చు పోలండ్ ప్రజలు క్రిస్టియన్‌మతాన్ని అనుసరించేవాళ్ళుకాగా, సోషలిజం మనిషికి తిండి బట్ట ఇల్లువుంటే చాలునని అతన్ని పశుస్థాయికి దిగజారుస్తుందికాబట్టి.

ఇందులో మొదటి పాయింటులో కొంత నిజం వుంది. భౌగోళికంగా రష్యా ప్రష్యా ఆస్ట్రియా రాజ్యాల మధ్య ఇరుకున్న పోలెండ్, ఆ రాజ్యాల విస్తరణ కాంక్షకు బలి అయిన మాట వాస్తవమే. ముఖ్యంగా, 18వ శతాబ్దంలో, రష్యాను కేథరీన్ రాణి, ప్రష్యాను ఫ్రెడెరిక్ చక్రవర్తి, పరిపాలించిన రోజులలో వాళ్ళ పోలెండ్‌ను రొట్టెముక్కను పంచుకున్నట్టు పంచుకున్నారు. ఈ శతాబ్దంలో హిట్లర్ తన ప్రపంచాధిపత్య వ్యూహంలో మొదటి మెట్టుగా పోలెండ్‌ను ఎంచుకున్నాడు.

రెండవ ప్రపంచ యుద్ధంలో హిట్లర్ ఓడిపోవడంతో అన్ని తూర్పు యూరప్ దేశాలతోసహా పోలెండ్‌లో గూడ ఖాళీఏర్పడింది. ఈఖాళీని అక్కడి సోషలిస్టు పార్టీలు రెడ్‌ఆర్మీ సాయంతో భర్తీ చేసాయి. సామ్రాజ్యవాద సైన్యాలజోక్యంవలన ఈ సాయం అవసరమయింది.

ఇంతవరకు నిజమేగాని, పోలెండులో సోషలిజానికి ఆదరణ లేకపోలేదు. ఇతర తూర్పుయూరప్ దేశాలలోలాగే పోలెండ్‌లోగూడ భూస్వామ్యవర్గం 20వ శతాబ్దంవరకూగూడ బలంగానిలిచింది. సోషలిస్టు విప్లవానంతరం ఏర్పడ్డ పోలెండ్ ఐక్యకార్మికపార్టీ ప్రభుత్వం భూసంస్కరణలు ప్రవేశపెట్టి రైతులకు భూములపై యాజమాన్యం కలుగజేయడంతో ఆ భూస్వామ్యవర్గం నశించింది. అలాగే, ఈకొత్త ప్రభుత్వం పారిశ్రామిక ఉత్పత్తి సాధనాలను తనచేతిలో కేంద్రీకరించి దేశాన్ని ప్రణాళికాబద్ధంగాను, వేగంగాను, పారిశ్రామికీకరించింది. 1940లో దేశ శ్రామిక జనాభాలో పారిశ్రామిక కార్మికులు 40శాతం మాత్రంకాగా 1975 నాటికి ఈ నిష్పత్తి 77కు పెరిగింది (మనదేశంలో ఈనిష్పత్తి ఈశతాబ్దంమొదట్లో 10శాతంలోపు; ఇప్పాళ గూడా 10 శాతంలోపే)

ఇదంతా పోలెండ్‌ప్రజలకు అక్కడి వ్యవస్థపట్ల సద్భావం కలిగించలేదనిగాని, వాళ్ళ సోషలిజాన్ని కేవలం సోవియట్‌రష్యా అధిపత్యంగా చూసారనిగాని, నమ్మటం కష్టం. సోవియట్‌రష్యా "పరస్పర ఆర్థికసహకారం" (Mutual Economic Assis -tance) పేరిట తూర్పుయూరప్‌దేశాలను ఆర్థికంగా లోబరచుకున్నమాట వాస్తవమే కాని ప్రణాళికాబద్ధమయిన ఆర్థికవ్యవస్థ సాధించగల ప్రగతిచాటున ఈదోపిడీ ఫలితం పోలెండ్ ప్రజలకు కనిపించలేదంటే ఆశ్చర్యంకాదు. అయితే ఈ దోపిడీకంటే ప్రత్యక్షమయిన రాజకీయ అధిపత్యాన్నిమాత్రం పోలెండ్ ప్రజలునిరసిస్తూ వచ్చారు. సోషలిజంపట్ల సద్భావమూ, రష్యాఆధిపత్యంపట్ల నిరసనా రెండూకలిసే వున్నాయన్నది ఈనాటి పోలెండ్‌కు సంబంధించి అతిముఖ్యమయిన విషయాల్లో ఒకటి.

పోతే, క్రిస్టియన్ మతాభిమానులయిన పోలెండ్ ప్రజలకు భౌతికవాద మార్క్సిజంపట్ల ద్వేషం వున్నదన్న వాదన నిజానికి కొత్తదికాదు, 1917లో రష్యా విప్లవం జరిగిన నాటినుండి పాశ్చాత్య 'పరిశీలకులు' కమ్యూనిస్టులు పాలిస్తోన్న దేశాలలో ప్రజలను మతం రక్షించి మళ్ళీపెట్టుబడిదారీ కూటమిలోకి తెస్తుందని కలలు కంటూనే వున్నారు. ఈమధ్య ఇరాన్‌లో ఇస్లాంమతం బానర్ క్రింద సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం జరిగినప్పుడు, ఇక సోవియట్ రష్యాలోని ముస్లింలు తిరగబడతారనీ ముస్లింమత పునరుద్ధరణవాదం కమ్యూనిజాన్ని దెబ్బతీస్తుందనీ అత్యుత్సాహంతో పాశ్చాత్యులు, కొందరు తిరోగామి ముస్లింలు, ఊహాగానాలుచేసారు అయితే అరవైఏళ్ళ ప్రణాళికాబద్ధ అభివృద్ధి సోవియట్ ముస్లింల జీవనప్రమాణాన్ని అత్యంతంగా పెంచిందని, అఫ్ఘానిస్తాన్‌ను అణచడానికి సోవియట్ సైన్యాలలో వెళ్ళిన సోవియట్ ముస్లింలు అక్కడి తమ తోటిముస్లింల నికృష్టజీవితాన్ని చూసి ప్రపంచంలో ఇంత పేదరికం ఉందా అని ఆశ్చర్యపోయారనీ తెలిసిన తరువాత ఈ ఊహాగానాలు చల్లబడ్డాయి.

ఇక రివిజనిస్టులవిషయం. వీళ్ళఅవగాహన ఈరకంగానడుస్తుంది : పోలెండ్ సోషలిస్టుదేశం. సోషలిస్టుదేశంలో కార్మిక నియంతృత్వం నడుస్తుంది. కార్మిక నియంతృత్వాన్ని వ్యతిరేకించే వాళ్ళెవరయినా కార్మిక వ్యతిరేకులే, సోషలిస్టు వ్యతిరేకులే. అంటే అమెరికా ఏజెంట్లే. కాబట్టి పోలెండ్ కార్మిక ఉద్యమసంస్థ అయిన సాలిడారిటీ నాయకులంతా అమెరికాఏజెంట్లే. పోలెండ్ నాయకులు చాలాపొరబాట్లు చేసినమాట నిజమే. ముఖ్యంగా, వాళ్ళుసోషలిస్టు ఆర్థిక సూత్రాలను విస్మరించారు. అయితే వాళ్ళు కార్మికనాయకులు కాబట్టి కార్మికులు నోరుమూసుకుని వాళ్ళను అనుసరించాలిగాని, తిరగబడడం సహించరాని విషయం.

ఈ వాదనచాలా లోతయినప్రశ్నలు లేవదీస్తుంది. వాటిని క్లుప్తంగానయినా సరే చర్చించాలి. ఆ క్రమంలోనే ఉద్యమం స్వభావంగూడ బోధపడుతుంది.

కార్మికనియంతృత్వం : కార్మిక నియంతృత్వమంటే ఏమిటి? కార్మికపార్టీ అని పేరుపెట్టుకున్న పార్టీ నియంతృత్వమా? ఆ పార్టీ దిగజారితే అప్పుడేమవుతుంది? దిగజారిందీ లేనిదీ తెలుసుకోవడానికి ఏమయినా ప్రమాణాలున్నాయా?

పాలకవర్గంఅంటే ఉత్పత్తి సాధనాలపైన ఆధిపత్యంఉన్నవర్గం. వర్గసమాజంలో ఉత్పత్తిసాధనాలు ఎవ్వరిచేతిలోవుంటాయో, రాజకీయాధికారం ఆ వర్గం చేతిలోవుంటుంది. అంటే ఆ వర్గనియంతృత్వం నడుస్తుంది. సోషలిజంగూడ వర్గ

సమాజమే. అక్కడ కార్మిక నియంతృత్వం నడవాలంటే, కార్మికులకు ఒక వర్గంగా ఉత్పత్తి సాధనాలమీదసమిష్టి యాజమాన్యం ఉండాలి, ఉత్పత్తి సాధనాలమీద నిజమైన యాజమాన్యం ఉండాలంటే యావత్ ఉత్పత్తి రంగంమీదా ఉండాలి. అంటే ఉత్పత్తి క్రమంమీద, పంపిణీ నిర్వహణమీద, మారకంమీద, అన్నిటికంటే ముఖ్యంగా ప్రణాళికలను రూపొందించడంలోను అమలుజరపడంలోను కార్మికవర్గానికి సమిష్టి నియంత్రికాధికారం వుండాలి.

ఇది సాధ్యమా? సాధ్యంకాదంటే కార్మిక నియంతృత్వం సాధ్యంకాదని సోషలిజం సాధ్యంకాదని, అంగీకరించాలి. అంటే మార్క్సిజాన్ని నిరాకరించాలి. అయితే ఇది సాధ్యమే. కాని ఒక్కరోజులో కాదు. భూస్వామ్యవర్గాన్ని పడగొట్టి అధికారంలోకి వచ్చిన పెట్టుబడిదారీ వర్గానికీ, పెట్టుబడిదారీవర్గాన్ని ఓడించి అధికారం లోకి వచ్చే కార్మిక వర్గానికీ ఒక ముఖ్యమయిన తేడావుంది. పెట్టుబడిదారీవర్గం భూస్వామ్య సమాజం మధ్యనే సాంస్కృతికంగాను రాజకీయంగాను పరిణతి చెంది అధికారం చెలాయించగల స్థాయికి ఎదిగిన తరువాతే అధికారానికి వస్తుంది. కార్మిక వర్గం ఈ అభివృద్ధిని అధికారానికి వచ్చిన తరువాతే సాధించాలి. తప్పక సాధిస్తుందన డానికి నువదేశ కార్మికులను ఈనాటి పోలండ్ ఉద్యమకారులతో పోల్చిచూస్తేచాలు, పోలండ్ కార్మికులు, తాము పనిచేసే ఫాక్టరీల నిర్వహణలో తమకు అధికారంకావా లని, అంటే ఒక ఫాక్టరీ ఎంత ఉత్పత్తిచేయాలి, ఏం ఉత్పత్తిచేయాలి. ఎంతకు అమ్మాలి. ఇత్యాది విషయాలు నిర్ణయించడంలో అక్కడ పనిచేసే కార్మికుల ప్రమే యం వుండాలని, డిమాండ్ చేస్తున్నారు. ఇదే సోషలిజమని ఎవ్వరూ భ్రమపడ కూడదు. ఏ ఫాక్టరీలోని కార్మికులకు ఆ ఫాక్టరీని నడపడంలో అధికారం లభిస్తే. అప్పుడు వివిధ ఫాక్టరీలలోని కార్మికులు సమిష్టి పెట్టుబడిదార్లు మాత్రమే అవుతారు, ఎందుకంటే వాళ్లు ఒకరితో ఒకరు పోటీపడకాతప్పదు, అధికలాభాలకోసం సరుకుల ఉత్పత్తి కొనసాగించకా తప్పదు (యుగొస్లావియాలో నడుస్తున్నది ఈ రకం 'సోషలిజ'మే. అందుకే అక్కడ ఏ సోషలిస్టు దేశంలోను ఉండకూడని నిరుద్యోగం, ద్రవ్యోల్బణం, ఇత్యాది). అయినప్పటికీ ఈ డిమాండు కార్మికుల సాంస్కృతిక పరిణతినీ, ఆత్మస్థైర్యాన్నీ, చూపుతుంది. నిజమైన కార్మిక నియంతృత్వం వెర్రి ఊహకాదని నిరూపిస్తుంది.

అయితే కార్మికులు ఆర్థికరంగాన్ని సమిష్టిగా నియంత్రించగల స్థాయికి ఎదగ డానికి చాలాకాలంపడుతుంది. అంతవరకు ఏంచేయాలి? అంతవరకు కార్మిక అగ్రి గామి పార్టీ నియంతృత్వం నడుస్తుంది. అయితే ఈ నియంతృత్వపు ప్రధానకర్తవ్యం,

కార్మికులను పార్టీనియంతృత్వం స్థానాన వర్గనియంతృత్వం నిర్వహించగలందుకు తర్ఫీదుచేయడం- అందులో ఒకముఖ్యమయినఅంశం. ఆర్థికరంగంలో పార్టీతేవాలని చూస్తున్న మార్పులను కార్మికులతో చర్చించడం, వాళ్ళను విద్యావంతుల్ని చేయడం, వారి సలహాను సమ్మతిని పొందడం- ఇదిదాని కనీసకర్తవ్యం.

సరిగ్గా ఈ కనీసకర్తవ్యాన్నే పోలండ్‌పార్టీగాని ఏ తూర్పుయూరప్ (రష్యాతో సహా) పార్టీగాని ఎన్నడూ నిర్వహించలేదు- వాళ్ళ రివిజనిస్టుదృష్టిలో సోషలిజంఅంటే వాళ్ళ నియంతృత్వమే- ఆ నియంతృత్వం కొన్నాళ్ళు కొనసాగినతరువాత 'కమ్యూనిజం' అనబడేది ఆకాశంనుంచి ఊడి ఒళ్ళోపడుతుంది- సోవియట్‌దొరలయితే ఆ కష్టంగూడ అవసరంలేకుండ, అప్పుడేతమది 'ప్రజలందరి రాజ్యం' (State of the whole people) అని ప్రకటించుకున్నారు- ఇక కమ్యూనిజందేనికి ?

ఈ దృక్పథంతో, పోలండ్‌పార్టీ నిర్వహించిన 'కార్మికనియంతృత్వాన్ని' పరిశీలిద్దాం- మొదట రైతాంగానికి ఆమోదనీయమయిన భూసంస్కరణలు ప్రవేశపెట్టారు. ఆటుతరువాత సమిష్టి వ్యవసాయాన్ని ప్రవేశపెట్టేటప్పుడుమాత్రం, ధనిక రైతాంగాన్నీ పేదరైతాంగాన్నీ వేరుచేసి పేదరైతాంగానికి విషయాన్ని వివరించి వారిసమర్థనతో ప్రవేశపెట్టకుండ, మీదినుండి సమిష్టివ్యవస్థను రైతాంగం పైకిరుద్దారు. రైతాంగం సహకరించకపోయేసరికి భయపడ్డారు. 1956లో గోముల్కా- పార్టీసెక్రెటరీ అయిన తరువాత అసలు సమిష్టి వ్యవసాయాన్ని విస్తృతచేసప్రయత్నాన్నే విరమించుకున్నారు- ఇవ్వాళ పోలండ్‌లో 85 శాతం వ్యవసాయిక భూభాగం ప్రైవేటురంగంలోవుంది- అటువంటప్పుడు ఎన్ని కంట్రోళ్ళుపెట్టినా, ఆర్థికసంక్షోభాన్ని నివారించడం కష్టం. ఎంతటి రాజకీయ చాతుర్యాన్ని ప్రదర్శించినా రైతాంగానికి ఇతరప్రజలకు వైరుధ్యాలు రాకుండ చూడడంకష్టం. సోషలిస్టు సమాజంలో వైరుధ్యాలుండవని ప్రకటిస్తేచాలదు. వాటికి వస్తుగతభూమిక (objective basis) లేకుండ చేయాలి.

తరువాత పారిశ్రామికీకరణ, ఆధునికీకరణ మొదలుపెట్టారు. ముఖ్యంగా గోముల్కాస్థానంలో 1970లో పార్టీపై పెత్తనం సంపాదించుకున్న గైరెక్ నాయకత్వాన, 1970-76ల మధ్య ఇవిరెండు అతివేగంగాసాగాయి- పారిశ్రామికీకరణయినా ఆధునికీకరణయినా, వాటంతటవి ఆహ్వానించదగ్గవే- కాని వాటిని సాధించిన పద్ధతే అభ్యంతరకరమయినది- దానివల్ల రాగల పర్యవసానాలను తాము గుర్తించలేదు, గుర్తించిన మేరకు కార్మికులతో చర్చించి, వారిని విద్యావంతుల్ని చేసి, వారిసలహా తీసుకోలేదు- ఆధునికీకరణకోసం పాశ్చాత్యదేశాలనుండి 25 బిలియనుడాలర్లు (దాదాపు

20 వేలకోట్లరూపాయలు) అప్పుతెచ్చుకున్నారు- అస్థిరమయిన పెట్టుబడిదారీ మార్కెట్ నుండి ఇంతమొత్తం అప్పుతెచ్చుకుంటే ప్రమాదకరమని పోలండు 'మార్క్సిస్టు' మేధావులకు తోచలేదు- వీళ్ళకు పెట్టుబడిదారీ వ్యవస్థ స్థిరత్వం పట్ల చాలా గట్టినమ్మకం ఉన్నట్లుందని చాలా మంది పరిశీలకులన్నారు- రివిజనిస్టుల నోటిలో మార్క్సిజం చిలకపలుకులతో సమానం అనడానికి ఇంతకంటే మంచి నిదర్శనం లేదనుకుంటాను.

వీళ్ళనమ్మకాలెట్లాగున్నా దాదాపు పదేళ్ళుగా ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో చాలా తీవ్రమయిన సంక్షోభం నడుస్తోంది- ఆ సంక్షోభమే పోలండ్‌లోగూడ సంక్షోభానికి దారితీసింది- తీసుకున్న 20 వేలకోట్ల రూపాయల అప్పుకు వడ్డీచెల్లించాలి. వడ్డీ చెల్లించాలంటే విదేశీమారకం సంపాదించాలి- విదేశీమారకం సంపాదించాలంటే సరుకులను పాశ్చాత్య మార్కెట్‌కు ఎగుమతిచేయాలి- అయితే సంక్షోభంలో ఇరుక్కున్న పాశ్చాత్య మార్కెట్‌లో కొనేవాళ్ళు తక్కువ కాబట్టి అక్కడిసంస్థలతో పోటీపడి పారిశ్రామిక ఉత్పత్తులను అమ్మడం కష్టం- అటువంటప్పుడు ఆహారపదార్థాలను ఎగుమతి చేయవలసివస్తుంది చేసారు- దేశంలో డిమాండును అదుపులోవుంచడంకోసం ఆహారపదార్థాల ధరలు పెంచారు- ఒక్క 1980 జూలై నెలలోనే మాంసం ధర 40 నుండి 80 శాతం వరకు పెరిగింది (ఈ ధరల పెరుగుదలకు పోలండ్‌కు అప్పులిచ్చిన పాశ్చాత్యుల ఒత్తిడిగూడ ఒక కారణం- ఈ విషయాన్ని మాత్రం పోలండ్ ప్రజల కోసం మొసలికన్నీళ్ళుకారుస్తోన్న పాశ్చాత్య పత్రికలు ఎన్నడూ చెప్పవు). ఇదంతా ఎందుకు జరిగిందో ప్రజలకు తెలియకపోవడంచేత, వాళ్ళతో ఎవ్వరూ చర్చించిన పాపాన పోకపోవడంచేత, వాళ్ళుతిరగబడ్డారు. జనాభాలో అత్యధికులయిన కార్మికులు సహజంగానే ముందునిలిచారు.

పెట్టుబడిదారీ అస్థిరత్వాన్ని తక్కువగా అంచనా వేయడం మాత్రమే కాకుండ, తీసుకోబూనుకున్న చర్యలను కార్మికులతోనూ ప్రజాసామాన్యంతోను చర్చించడం, వారిసలహాతీసుకోవడం, మొదలయిన కనీస సోషలిస్టు కర్తవ్యాలను విస్మరించడం వల్లనే ఇది జరిగింది.

ఇంతవరకూ బహుశా రివిజనిస్టులలో కొందరు (సి. పి. ఐ (ఎం) వంటివారు) అంగీకరించవచ్చు. కాని దీనికి కారణం కేవలం మతిమరుపా, అజ్ఞానమా, లేకవేరే ఏదయినావుందా అని మాత్రం వాళ్ళు ఆలోచించరు. అసలు విషయం ఏమిటంటే, రష్యామొదలుకొని అన్ని తూర్పు యూరప్‌దేశాలలోను, కార్మికులపేరిట అధికారం కైవసం చేసుకున్నవారిలో (పార్టీలోను, ప్రభుత్వఅధికార్లలోను, సాంకేతికనిపుణుల

లోను) ఒక కొత్త వర్గం ఏర్పడింది. ఈ వర్గం సోషలిజాన్ని తన అవసరాలకు లొంగదీసుకుంది. పాశ్చాత్యదేశాల జీవన విధానంపట్ల తనకు మోజుఏర్పడ్డనాడు ఆధునికీకరణకు పూనుకుందేగాని, ప్రజల అవసరాల దృష్ట్యాకాదు. అతివేగంగా నడిచేకార్లు, తమ ఇంటింటా రెఫ్రిజరేటర్లువుంటే 'ఎంచక్కా' వుంటుందనిపించి ఆర్థిక రంగాన్ని ఆధునికీకరించారు. నష్టం ప్రజలకే లెమ్మని 20 వేలకోట్ల రూపాయలు అప్పుతెచ్చుకున్నారు. ధనిక రైతాంగం సమిష్టి వ్యవసాయాన్ని ఎదిరిస్తే వీళ్ళతో గొడవెందుకులెమ్మని మీయిష్టమే కానిమ్మన్నారు. తమది బూర్జువా దృక్పథమే కాబట్టి పెట్టుబడిదారీ వ్యవస్థ నిరంతరం సంక్షోభాలకులోనై నడుస్తుందన్న ప్రాథమిక మార్క్సిస్టు సూత్రాన్ని విస్మరించి పాశ్చాత్య మార్కెట్టుతో పోలండ్ ఆర్థికవ్యవస్థకు బలంగా లంకెవేసారు (పోలండ్ విదేశీవ్యాపారంలో 40 శాతం పాశ్చాత్యదేశాలతోటిదే) తమదొక స్వార్థపర వర్గదృక్పథం కాబట్టి, కార్మికవర్గాన్ని కార్మికనియంతృత్వానికి తర్ఫీదుచేయడంగాని, కనీసం దేశఆర్థికరంగానికి సంబంధించిన విషయాలు అగ్రగామి కార్మికులతో చర్చించడంగాని, చేయలేదు. ఈ కొత్త బూర్జువావర్గ స్వార్థం దేశానికి తెచ్చిపెట్టిన సంక్షోభంగా అర్థంచేసుకుంటేనే మనకు పోలండ్ సమస్య అర్థమవుతుంది. కేవలం పార్టీ 'పొరబాట్లుగా' అర్థంచేసుకుంటే, ఈ 'పొరబాట్లు' ఎందుకు జరుగుతున్నాయో, ఎంతకాలం జరుగుతాయో, ఎంతమంది అమాయకులయిన 'అమెరికా ఏజెంట్ల'ను ఈ 'పొరబాట్ల'కు బలిపెట్టాలో తెలీదు (1970 లో కార్మిక తిరుగుబాటు జరిగినప్పుడు కొన్ని వందల మందిని కాల్పులలో చంపారు).

సోషలిజం

రెండవ ప్రశ్న, అసలు సోషలిజం అంటే ఏమిటి అన్నది. కార్మిక నియంతృత్వం క్రింద, కార్మిక నియంతృత్వపు మొదటి దశ అయిన కార్మికపార్టీ పాలన క్రింద, నడిచేది సోషలిజం. ఈ సోషలిజం పరిణామదశ. సమాజాన్ని వర్గసమాజం నుండి వర్గరహిత సమాజంవైపు కార్మిక నియంతృత్వంక్రింద నడిపించేదశ పరిణామ దశను అంచనావేసేప్పుడు ఆ పరిణామాన్ని అది సాధిస్తోందాలేదా అన్నదే ప్రమాణం అవుతుంది అంటే, 'పోలండు సోషలిస్టు దేశంకాబట్టి ఉద్యమకారులు సోషలిస్టు వ్యతిరేకులు' అని ప్రకటించేవారు, అసలు పోలండ్ వర్గరహిత సమాజంవైపు నడుస్తోందా అని ముందు అంచనావేయాలి. అంటే ఆదేశంలో అసమానత, అస్థిరత, మూఢత్వం, అజ్ఞానం, తగ్గుతున్నాయా, స్త్రీలపట్ల తరతరాలుగా వస్తోన్న చులకనభావం తగ్గుతోందా అన్నిటికంటే ముఖ్యంగా ప్రజలు నిజమయిన స్వేచ్ఛవైపు నడుస్తున్నారా, అని

చూడాలి. నిజమయినస్వేచ్ఛ బూర్జువా స్వేచ్ఛాకాదు, రివిజనిస్టు స్వేచ్ఛాకాదు మనిషికి వాక్‌స్వాతంత్ర్యం, సభాస్వాతంత్ర్యం, వుంటే అదే స్వేచ్ఛ అంటుంది బూర్జువాదృక్పథం. కడుపుకుతిండి, జీవితానికి భద్రత, లేనివాడు ఈ స్వాతంత్ర్యాలను నిజానికి వినియోగించుకోలేడు కాబట్టి అది బూటకపు స్వేచ్ఛ అన్న వాదన అందరికీ తెలిసిందే. అంతేకాదు, జీవితానికి భద్రత ఉన్నవాళ్ళకుగూడ బూర్జువాస్వేచ్ఛ స్వేచ్ఛకాదు. తన జీవితాన్ని, తానునివసిస్తున్న సమాజజీవితాన్ని, రూపొందించుకునే స్వేచ్ఛే నిజమయిన స్వేచ్ఛ. కాని బూర్జువా సమాజంలో తమ జీవితాల్ని రూపొందించుకునే స్వేచ్ఛ ప్రజలకు లేదు. పదిమంది పెట్టుబడిదార్ల స్వార్థం జనంజీవితాల్ని రూపొందిస్తుంది. ఇవ్వాళ మనదేశంలో యువతకు మానవత్వపు విలువలునేర్పాలా అమానుషత్వపు విలువలు నేర్పాలా అని నిర్ణయించేది వాళ్లను పెంచిన తల్లిదండ్రులూకాదు, వాళ్లకు చదువుచెప్పే పంతుళ్లూకాదు; తమలాభాలకోసం లంపెన్ సంస్కృతిని ప్రచారంచేస్తున్న సినిమా పెట్టుబడిదార్లు, వ్యాపారపత్రికల యజమాన్లు. రేపటి సామాజిక వాతావరణాన్ని నిర్ణయించేది వీళ్లేగాని, వాక్‌సభా స్వాతంత్ర్యాలున్న ప్రజాసామాన్యం కాదు. మనిషిని పెట్టుబడిదారీ ఆర్థిక సంబంధాలతో బంధించి, నీ యిష్టం వచ్చినంతగా కేకలుపెట్టే స్వేచ్ఛ నీకుందంటుంది బూర్జువా సమాజం. అదే బూర్జువా స్వేచ్ఛ.

రివిజనిస్టుస్వేచ్ఛ మరోరకంబూటకం. దీన్ని నిర్వచించడానికి మాస్కో-తాత్వికులు ప్రయత్నించారోలేదో నేనెరుగనుగాని, వారి అనుచరులు కొందరు అంతటి సాహసమూచేసారు. 'మానవుడికి కొన్ని అవసరాలున్నాయని గుర్తించి వాటిని తీర్చడమే స్వేచ్ఛ' అని తెలుగుదేశపు రివిజనిస్టు మేధావులలో అగ్రగణ్యుడయిన ఏటుకూరి బలరామమూర్తిగారు అన్నారు. (భారతీయ తత్వశాస్త్రం, పేజీ 226). అంటే అర్థం పరిపాలించేపార్టీ అందరికీ తిండీ బట్టా ఇల్లూ ఉద్యోగం ఇస్తుంది, చదువుకోవడానికి అబద్ధాలతోనిండిన పత్రికలు ప్రకటిస్తుంది చూడడానికి చరిత్రను వక్రీకరించే సినిమాలు ప్రదర్శిస్తుంది. వీటన్నిటినీ అనుభవిస్తూ గానుగెద్దుల్లా జీవించడమే రివిజనిస్టుస్వేచ్ఛ.

నిజమయినస్వేచ్ఛ సుప్రసిద్ధమయిన ఎంగెల్స్‌సూక్తితో ప్రారంభమవుతుంది. 'ఆవశ్యకతను అంగీకరించడమే స్వేచ్ఛ' (freedom is the recognition of necessity) తానునివసిస్తున్న ప్రపంచానికి ఒక వస్తుగత స్వభావముందని మనిషికి తెలియాలి. ఆ వస్తుగత స్వభావాన్ని ('ఆవశ్యకత'ను) అధ్యయనంచేసి అర్థంచేసు

కోవాలి (అందరూ అధ్యయనంచేయాలి, అందరూ అర్థంచేసుకోవాలి, పార్టీ సైద్ధాంతికుడు కామ్రేడ్ సుస్లోవ్ చేసుకుంటేచాలదు.) అర్థంచేసుకుని దాన్ని అనుసరించి తన ఆశయాలను మలచుకుని వాటిని సాధించేక్రమంలో సచేతనంగా పాల్గొనాలి. ప్రపంచపు వస్తుగత స్వభావాన్ని అనుసరించి దాన్ని నిరంతరం మార్చేక్రమంలో నలుగురితో కలిసి సచేతనంగా కృషిచేయగలగడమే నిజమైనస్వేచ్ఛ. ప్లాట్ ఫారం మీదనుండి ఉపన్యాసాలు ఇవ్వడమూకాదు, కడుపునిండాతిండితిని గొంగళిపురుగులా పడిఉండడమూకాదు.

కాబట్టి ఇవ్వాళ పోలండ్ కార్మికోద్యమాన్ని సోషలిస్టు వ్యతిరేక ఉద్యమంగా చిత్రిస్తున్న వారు వేసుకోవలసిన ప్రశ్న, అసలు పోలండ్ ఇవన్నీ సాధిస్తోందా అన్నది. అసమానత, అస్థిరత, తగ్గాయా? 85 శాతం వ్యవసాయిక భూభాగం ప్రైవేటు చేతుల్లోవున్నప్పుడు అసమానతమీద కంట్రోలు ప్రభుత్వానికి ఎట్లావుంటుంది? పెట్టుబడిదారీ మార్కెట్‌తో అంతబలమయిన సంబంధంవున్న ఆర్థికవ్యవస్థ అస్థిరత నుండి ఎట్లాతప్పించుకుంటుంది? పోనీ అక్కడ అజ్ఞానం, మౌఢ్యం, తగ్గాయా? తగ్గివుంటే క్రిస్టియన్ మతం ప్రాబల్యం రోజురోజుకూ ఎందుకు పెరుగుతుంది? అక్కడ స్త్రీలపట్ల వర్గసమాజ దృక్పథం క్షీణిస్తోందా? క్షీణిస్తోంటే తూర్పుయూరప్ దేశాలన్నింటిలోనూ కేబరేలకు నైట్‌క్లబ్బులకూ అంత ఆదరం ఎందుకు? (ఒక రష్యాపార్టీ మహిళ ఒకతూర్పు యూరప్ దేశంలో కేబరేలనుచూసి 'దీన్ని మీరు సోషలిజం అంటారా?' అని ఆశ్చర్యం వెలిబుచ్చిందట. అయితే ఈ రకం 'సరదాలు' రష్యాకుగూడ పాకుతోన్నట్టు తెలుస్తోంది). చివరిగా, అక్కడ ప్రజలు నిజమయిన స్వేచ్ఛవైపు పయనిస్తున్నారా? అసలు స్వేచ్ఛను గురించి బలరామమూర్తిగారి స్థాయినిదాటే అవగాహనే లేని పార్టీలు నిజమయిన స్వేచ్ఛవైపు ప్రజలను ఏరకంగా నడపగలుగుతాయి?

ఉద్యమస్వభావం : సారాంశంలో, ఈనాటిపోలండ్ కార్మికోద్యమం ఆ దేశంలో కొత్తగాఏర్పడ్డ వర్గవ్యవస్థ సృష్టించిన సంక్షోభాల ఫలితమేగాని, సోషలిస్టు వ్యతిరేక ఉద్యమంకాదు. ఎందుకంటే పోలండ్‌లో సోషలిజం (అంటే కమ్యూనిజం వైపునడిచే పరిణామదశ) లేదు. అయితే ఈ ఉద్యమం సోషలిజాన్ని స్థాపించడం కోసమూ జరగడంలేదు, అది కేవలం ఆర్థికవాదం (economism) మీద నడుస్తోంది. ఒక పత్రికావిలేకరి పోలండ్ కార్మికుడొకడితో 'మీరు నిజమయిన కార్మిక నియంతృత్వంకోసం పోరాడుతున్నారు?' అనంటే అతను సమాధానంగా 'కార్మికనియంతృత్వం సంగతి దేవుడెరుగు, మాకు ధరలుతగ్గితేచాలు' అన్నాడట. ఉద్యమంమీద మతం ప్రభావంగూడ బలంగానేఉంది. పోలండ్ కార్మికులమీద చర్చికిఉన్న ప్రభా

వాన్ని గురించి పాశ్చాత్య పత్రికలు విపరీతమయిన అతిశయోక్తులు ప్రచారం చేస్తోన్న మాట వాస్తవమే (వాటిసకిలీ ఉదారవాదానికి మధ్యయుగాల మతం ఎన్నడూ ఆటంకం కాలేదు) అయినప్పటికీ ప్రభావం బలంగాఉన్న మాట కాదనలేం, ఈ ప్రభావం అన్నిరకాలాచెడ్డది. అవాస్తవికమయిన సైద్ధాంతిక దృక్పథాన్ని ఏర్పరచడమే కాకుండ, పోరాటాన్ని నీరుగార్చి సర్దుబాటును ప్రోత్సహిస్తుంది. పోలండ్ కార్మికుల పోరాటచరిత్ర అదినుండీగూడ చర్చి 'బాధ్యతాయుతమయిన మధ్యవర్తి' పాత్ర నిర్వహించి వ్యవస్థ దెబ్బతినకుండ చూస్తోంది. పార్టీ చర్చి మైత్రిని కోరడానికిగూడ ఈ సౌకర్యమే కారణం.

ఈ సైద్ధాంతిక దౌర్బల్యంవల్ల పోలండ్ కార్మిక ఉద్యమం ఇంతవరకు పాలక పార్టీ నాయకులను మార్చడం తప్ప మరేమీ సాధించలేకుండ వుంది. 1956 లో పొజ్నాన్ పట్టణంలో 50 వేలమంది కార్మికులు జరిపిన తిరుగుబాటు గోముల్కాను పదవికి తెచ్చింది, కొత్త అపోహలను సృష్టించింది. 1970 లో ఆహారపదార్థాల ధరల పెరుగుదలకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటు గోముల్కాస్థానంలో గైరెక్‌ను అధికారంలోకి తెచ్చి మళ్ళీ కొత్త అపోహలను సృష్టించింది. మొన్న 1980 ఆగస్టులో వార్సాదగ్గర ఒక ట్రాక్టరు ఫాక్టరీలో ప్రారంభమై సాలిడారిటీ సంస్థ నాయకత్వాన సంవత్సరంన్నర నడిచిన ఉద్యమం గైరెక్‌స్థానంలో కానియాను తెచ్చింది. కార్మికులకు రైతులకు పార్టీనుండి స్వతంత్రమయిన యూనియన్లను ఏర్పరచుకునే స్వేచ్ఛను ఇచ్చింది. అయితే ఈ కొద్దిపాటి సంస్కరణను గూడ సహించలేని రష్యా ప్రోద్బలంతో పార్టీ చివరికి సైనికపాలన విధించింది. అందుకు మెచ్చుకోలుగా రష్యా పాలకులు నెలతిరగక ముందే పోలండ్‌కు 3 వేలకోట్ల రూపాయల అప్పుఇవ్వడానికి ఒప్పుకున్నారు (అదే రష్యా, సైనికపాలన విధించకముందు, పోలండ్‌లోని అస్థిరపరిస్థితుల దృష్ట్యా ఆర్థిక సహాయం ఇవ్వడం సాధ్యంకాదంది అంటే అర్థం, కార్మికులను అణిస్తేనే, 'సోషలిస్టు సహాయం' అనబడేతాయిలం లభిస్తుందని).

సరయిన సిద్ధాంతమే గనకవుంటే, దేశంలో మూడువంతుల ప్రజల సభ్యత్వమే వున్న సాలిడారిటీ, వియత్నాం ప్రజలు అమెరికా సామ్రాజ్యవాదానికి ఇవ్వగలదు. (పోలండ్ జనాభా 3 కోట్లచిల్లర. కార్మికుల సాలిడారిటీ, రైతుల సాలిడారిటీ, కలిపి సభ్యత్వం ఒక కోటి పైచిలుకు. ఇది కేవలం సభ్యత్వం మాత్రమే. మద్దతుదార్లను గూడ కలిపితే జనాభాలో సగంకావచ్చు). విప్లవకర సిద్ధాంతంలేమి ఇన్నాళ్లు బయటపడలేదుగాని సైనిక పాలనవిధించిన తరువాత బయటపడకతప్పదు. తమకు విముక్తిని ఈయగలది మార్క్సిజం మాత్రమేనని, రివిజనిస్టులు సొంతంచేసుకుని గుర్తుతెలియనంతగా వక్రీకరించిన మార్క్సిజంకాదని, విప్లవకర మార్క్సిజమని, పోలండ్ కార్మికులు గుర్తించిన నాడే వాళ్ళకు విముక్తి. అంతవరకు ఈ ముసుగులో గుద్దులాట తప్పదు.

(+) ఇలాంటి పోరాటం సోషల్ సామ్రాజ్యవాదానికి

మానవతా విలువలు :

# "బీహార్ అగ్నిపర్వతం నాడీస్పందన"

పి.యు.డి.ఆర్.

రాజ్యాంగంలో పొందుపరచబడిన హక్కులకు గ్యారంటీ ఇవ్వాలని, రాష్ట్ర ప్రభుత్వం చేసిన వివిధ చట్టాలను అమలుపరచాలని బీహార్‌లోని పాట్నా జిల్లాలో దాదాపు ఏడుబ్లాకులలో ఆందోళనచేస్తున్న పేదరైతుల, వ్యవసాయకూలీల ప్రజాస్వామిక ఉద్యమాన్ని రాష్ట్రప్రభుత్వం, దాని పోలీసు యంత్రాంగం భూస్వాముల సహాయంతో, అన్ని పెద్దరాజకీయపార్టీల బహిరంగ సహకారంతో క్రమబద్ధంగా అణచడానికి ప్రయత్నం చేస్తున్నాయి.

ఢిల్లీ పీపుల్స్‌యూనియన్ ఫర్ డెమొక్రటిక్‌రైట్స్ (పియుడిఆర్) నియమించిన విద్యావేత్తలు పత్రికారచయితలతో కూడిన కమిటీ పరిశీలనలో ఈ విషయం తేలింది. పోలీసు కాల్పులగురించి, తీవ్రవాదుల ఆందోళనల పేరుమీద ప్రజలను అరెస్టు చేయడంగురించి వచ్చిన పత్రికావార్తలను చూసినతర్వాత పి యు డి ఆర్ ఈ కమిటీని నియమించింది. కమిటీ డిసెంబర్ మొదటివారంలో ఈప్రాంతాలన్నీ తిరిగి వ్యవసాయ కూలీలను, భూస్వాములను, అన్నిప్రాంతీయ, రాష్ట్రరాజకీయ పార్టీల నాయకులను, పేదలపక్షంఉన్న కిసాన్‌సభ సంస్థను నిర్వహిస్తున్న వాళ్ళను, పత్రికారచయితలను విద్యావేత్తలను, రాష్ట్రప్రభుత్వ అధికారులను, పోలీసులను ఇంటర్వ్యూ చేసింది.

కల్లోలానికి గురయిన ప్రాంతాలు పాట్నాజిల్లాలోని మసారి, విక్రమ్, పాలి, నౌబత్‌పూర్, ధన్‌రువా, పున్‌పున్, పటువాబ్లాకులు.

ఈ అశాంతికికారణం తీవ్రవాదుల, నక్సలైట్ల కార్యకలాపాలని రాష్ట్రప్రభుత్వం భావిస్తున్నది. వాళ్ళు 'సాయుధ ప్రచారం' నిర్వహిస్తున్నారని 'సమాంతర ప్రభుత్వాలు' ఏర్పాటుచేసారని ఆరోపిస్తున్నది. ఈ అభిప్రాయమే స్థానిక పత్రికలకు కూడాఉంది. అయినప్పటికీ కేంద్ర హోంశాఖా సహాయమంత్రి యోగేంద్ర మక్వానా లోక్‌సభలో డిసెంబర్ 9న 'రాష్ట్రప్రభుత్వం చెప్పేదాన్నిబట్టి 'సమాంతర ప్రభుత్వం' గురించిన వార్తలు నిరాధారమైనవి' అన్నాడు.

మా విచారణలో జనాభాలోని నిరుపేద ప్రజలు ఈ ప్రాంతాల్లో తీవ్రమైన అణిచివేతలకింద బతుకుతున్నారని తెలిసింది. భూయాజమాన్యంలో అసమానతలు, కనీసవేతనాల నిరాకరణ, కూలీలను కొట్టడం, వారిస్త్రీలను చెరచడం ఈ అణిచివేతకు నిదర్శనాలు. ఇవే అక్కడి అశాంతికి మూలం అని తెలుస్తున్నది. ప్రజలు కిసాన్

సభ అధ్వర్యంలో సంఘటితమయి రాజ్యాంగ పరిధిలోని కొన్ని హక్కుల కొరకు గొంతెత్తారు. వాళ్ళు హక్కులను సాధించుకోవడానికి గ్రామస్థులు ఊరేగింపులు, సభలు, సమ్మెలవంటి శాంతియుతమైన పద్ధతులు అవలంబించారు. వీటితోపాటు పంచాయతీ పద్ధతిలోని గ్రూపుమీటింగ్‌లను తిరిగి ప్రవేశపెట్టించి సామూహిక నిర్ణయాలు తీసుకున్నారు.

ఈ ప్రాంతంలో అన్ని రాజకీయపార్టీల భూస్వాములు స్థానిక అధికారులతో కలిసి కొన్నిరకాలభూమి, కూలిచట్టాలను అమలుజరుగకుండా చేస్తున్నారు వాళ్ళు కిసాన్‌సభ నడుపుతున్న ఉద్యమాన్ని సాయుధంగా వ్యతిరేకించారు. పోలీసులు ఈ ప్రాంతమంతా మూకుమ్మడి దాడులుజరిపి చాలామంది ప్రజలనుకొట్టి అరెస్టుచేసారు. పోలీసుకాల్పుల్లో దాదాపు ఏడుగురు చనిపోయారు. రాష్ట్రప్రభుత్వం 150 మంది ఉద్యమకారులను ఎన్‌కౌంటర్ పేరుతో ఏరివేయాలని పథకంవేసుకున్నట్టు విశ్వసనీయమైన వర్గాలద్వారా తెలిసింది.

సాంఘిక ఆర్థిక పూర్వరంగం: పాట్నాజిల్లాలోని గ్రామీణజనాభా ఈ బ్లాకుకూడా కలిసి జిల్లామొత్తంజనాభాలో 69 8%, జిల్లాలోని శ్రామికులలో 67.1% మొత్తం వ్యవసాయపనుల్లో ఉన్నారువీరిలో అధికభాగం(52.6%) వ్యవసాయకూలీలు. మొత్తం భూమికలిగిన వాళ్ళలో 68 4% మామూలుగా భూమికలవారు (2 5 ఎకరాలు కలిగినవారు) 14% చిన్నరైతులు (2½-5 ఎకరాలమధ్య భూమికలవారు) తక్కువమంది (16 7%) ఎక్కువభూమి ఉన్నవాళ్ళు ఈ పరిస్థితుల్లో భూమిలేనికూలీలు పేదరైతులకోసం పోరాడుతున్న కిసాన్‌సభ డిమాండ్లు కనీసవేతనాలు చెల్లించడం మిగులుభూమిని భూమిలేని వాళ్ళకు పంచిపెట్టడం, అత్యవసరమైన వ్యవసాయఉత్పత్తుల ధరలతగ్గింపు మొదలయినవి అనుచితమైనవికావు.

భూమినికలిగిఉన్న అన్నిరకాలవారు వాళ్ళు రెండుఎకరాలున్న మామూలు రైతులుకానీ, 50 ఎకరాలపైనఉన్న పెద్దరైతులుకాని వ్యవసాయకూలీలను పనికి పెట్టుకుంటారు కూలీలను పెట్టుకోవాల్సిన అవసరం, కూలీలసంఖ్య భూమినిబట్టి ఉంటుంది భూస్వాములను ఇక్కడ జమీందార్లులేక సామంత్‌లు అనిఅంటారు. సామంత్‌లకు 50 ఎకరాలకంటే ఎక్కువభూమి ఉంటుంది, ఇంకా తక్కువకూడా ఉండవచ్చు. ఉదాహరణకు పిర్హిగ్రామం (బిక్రమ్‌బ్లాక్)లో సామంత్‌గా పిలవబడే వాళ్ళెవ్వరికీ 15 ఎకరాలకంటె ఎక్కువభూమిలేదు. వాళ్ళలో ఒకతనికి 10 ఎకరాలకు తక్కువేవుంది కాని గ్రామంలో పెండిగిర్నిఉంది. కానిఇటువంటివాళ్ళంతా వాళ్ళు ఏ కులానికిచెందిన

వాళ్ళయినా ఎంతభూమిఉన్నా స్వయంగా వ్యవసాయపుపనులు చేసుకోకుండా భూమి ఉండి సాగుచేసుకొనే కిసానులుగా పిలవబడుతున్నవాళ్ళకు మజ్దూర్‌గా వ్యవహరించబడే వ్యవసాయకూలీలకు వ్యతిరేకంగా నిలబడ్డారు.

ఎక్కువ ఎకరాల భూమికలిగి జమీందారులుగా గుర్తించబడ్డవాళ్ళే వాళ్ళకు, భూమిలేనివాళ్ళకు మధ్య ఉద్రిక్తత ఏర్పడడానికి కారణమయినవాళ్ళు. వీళ్ళు తమకున్న ఎక్కువ భూమిని దాచివేసి భూపరిమితి చట్టాన్ని ఉల్లంఘిస్తున్నారు.

ఈ ప్రాంతాల్లో వ్యవసాయక అలజడులకు భూమి కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతమై ఉండడమే కారణంగా కనబడుతున్నది. కొద్దిమంది జమీందార్ల చేతుల్లో అక్రమంగా ఉన్న అదనపుభూమిని భూమిలేని పేదప్రజలకు, చిన్నరైతులకు పంచిపెట్టాలన్న కిసాన్‌సభ డిమాండు అమలుపరచడం అవసరం.

వ్యవసాయకూలీలకు ఇచ్చే కూలిమాత్రం ప్రభుత్వం నిర్ణయించిన కనీసవేతనం కన్న చాలా తక్కువ. నౌబత్‌పూర్‌లో రెండురకాల కూలీలున్నారు. కొంతమంది మామూలుకూలీలు కొంతమంది భూస్వామిదగ్గరే పనిచేస్తారు. భూస్వామి దగ్గర పనిచేసే కూలి తన యజమాని దగ్గరే పనిచేయాల్సి ఉంటుంది. ఎందుకంటే అతని దగ్గర ప్రతిఫలంగా కొంత పొలం (ఎకరంలో 1/3 వంతుగాని 1/2 గాని) కౌలుకు తీసుకోవడమో లేక అతని దగ్గర అప్పుతీసుకొని తీర్చుకోవడం కోసమో. వీళ్ళను (హల్‌వాహస్) నాగలిదున్నడానికి ఉపయోగించుకుంటారు. కాని వాళ్ళు మిగతా కుటుంబసభ్యులతోపాటు అన్ని వ్యవసాయపుపనులు చేయాల్సిఉంటుంది. ఒకరోజుపనికి బత్తెంగా 13 కన్వ్వాలబియ్యం (811 గ్రాములు) మరియు 5½ కన్వల (325 గ్రా) సట్టు (ఒకరకమైన పప్పుదినుసు) ఒకపూట భోజనంతోపాటు ఇస్తారు. సికందర్‌పూర్ గ్రామంలో 10 కన్వ్వాలబియ్యం (582 గ్రా) 10 కన్వలసట్టు ఒకరోజు కూలిగా ఇస్తారు (కౌలుకు 1/3 లేక 1/2 ఎకరం పొలంతో పాటు) భోజనం సంగతి ఏమీ చెప్పలేదు. కాని రోజుకూలీలో ఒకపూట భోజనంకూడా ఉంటుందని ఒకళ్ళు చెప్పారు. భోజనం కాకుండా దీనివిలువ రెండు ప్రాంతాల్లో రు 1.75 నుంచి 2.25 వరకు ఉంటుంది. మొత్తం పాట్నా జిల్లాలో హల్‌వాహస్‌లకు రోజుకూలి కనీసవేతనం 2 1/4 నుంచి 2½ కిలోల బియ్యం 600 గ్రా సట్టు మరియు కనీసం 1/2 ఎకరం భూమి కౌలుకు ఇవ్వాలని ఉంది. దీని విలువ డబ్బుల రూపంలో 5 రూ॥ భోజనంతోకలిసి. మామూలుగా ఇచ్చేకూలి కన్న ఇది చాలా తక్కువ అని స్పష్టంగా తెలుస్తున్నది.

కోతలప్పుడు గుత్తకుఇస్తారు- ఇది సాధారణంగా అన్ని బ్లాకులలోను ఒకే రకంగాఉంది. పదహారు కోసినకుప్పలకు ఒకకుప్పకూలి. ఈసీజన్‌లో వాళ్ళకు భోజనం

ఇవ్వరు- ఇక్కడ కూలీలను దోచుకోవడమన్నది మిగతాసమయాలకంటె వరికోతలప్పుడు ఎక్కువగా ఉంటున్నది.

కూలీల, చిన్నరైతుల హీనమైనపని, జీవనపరిస్థితులవల్ల పీడకులకు వ్యతిరేకంగా వాళ్ళు సంఘటితమవటం న్యాయంగావుంది. గత వ్యవసాయక ఉద్రిక్తతను ఈకోణంనుంచి పరిశీలించవలసి ఉంటుంది. భూస్వాములు సీలింగుచట్టాలను కూలి చట్టాలను ఉల్లంఘించడంలో ఇక్కడి పోలీసులు సివిల్ అధికారులు వాళ్ళతో కుమ్మక్కు కాకున్నా మామూలు ప్రేక్షకులయ్యారు- ఈ పరిస్థితులు చాలాకాలంనుంచి కొనసాగడానికి ఈ భూస్వాముల సాంఘిక రాజకీయ అధికారం అంతటా వ్యాపించినట్టుంది.

<u>వ్యవసాయిక అశాంతి, కిసాన్‌సభ</u> : పాట్నాజిల్లా ముఖ్యంగా మసౌరి, పున్‌పున్ ప్రాంతం 1970-80 మధ్యలో తీవ్రమైన సాంఘికఘర్షణలకు నిలయమైంది. 1975లో అత్యవసరపరిస్థితి విధించేముందు ఇక్కడకు ఒకభూస్వామి కొందరు హరిజన కూలీలు చనిపోవడానికి కారణమయిన పరిస్థితులను అదుపులోపెట్టడానికి బీహార్ మిలిటరీపోలీస్ (బి ఎం పి) సరిహద్దు భద్రతాదళం (బి ఎస్ ఎఫ్), కేంద్రరిజర్వ్ పోలీస్ (సి ఆర్. పి.)దళాలు వచ్చాయి. ప్రస్తుత అశాంతి పదినెలలకింద మొదలయ్యింది- వ్యవసాయకూలీలు, చిన్నరైతులు స్వయంగా సంఘటితపడడం జరిగింది గత నాలుగేళ్ళుగా బెల్చి, పిప్రా (పాట్నాజిల్లా), బిశ్రాంపూర్ (రోహతాస్‌జిల్లా,) పరస్‌బిఘా (గయజిల్లా)లలో పేదప్రజలు అంతులేనిపీడనకు గురిఅవడంవల్ల సంఘటిత పద్దారవిపిస్తున్నది.

ఆర్థికంగా అణచివేయబడ్డ ప్రజలు బీహార్-ప్రదేశ్‌కిసాన్‌సభ కింద సంఘటితమై చైతన్యవంతులవుతున్నారు, ఈప్రాంతంలో ఈసంస్థ చాలా ముఖ్యమైనపాత్ర వహిస్తున్నది.

ఫిబ్రవరి 1981లో పాట్నాలో గొప్పప్రదర్శనజరిపి బి పి కె యస్ రాజకీయ రంగంలో ప్రముఖ పాత్రవహించింది- ఇది పాట్నాతోసహా పదిజిల్లాల్లో చురుగ్గా పనిచేస్తున్నది- నవంబర్ 1981లో పాట్నాలో మొదటి రాష్ట్రస్థాయిసభ జరిగింది. పాట్నాజిల్లాలో దాదాపు ఏడుబ్లాకులలో పున్‌పున్, బిక్రం, మసౌరి, ధన్‌రువా, పాలి, నౌబత్‌పూర్‌లలో చాలాగ్రామాల్లో కిసాన్‌సభలు పనిచేస్తున్నాయి- మొదటి మూడు బ్లాకులలో కిసాన్‌సభ బలంగాపాతుకపోయింది. సభలున్నగ్రామాలెన్నో మేము తెలుసుకోలేకపోయాము- నిజానికి అకస్మాత్తుగా సభ వ్యాప్తిచెందడవల్ల అంచనా వేయలేకపోయాము. పాట్నాలో మేము కలిసిన అనధికారులు అందరూ ఇది అక

స్మాత్తుగా వచ్చిన ఉద్యమంఅన్నారు- కొందరు ఇందులో నక్సలైట్లు ఉన్నారని చెప్పారు. మరికొందరు దీనికి సి. పి. ఐ(ఎం ఎల్)తో సంబంధాలు ఉన్నాయన్నారు.

బిపికెయస్ రాష్ట్రఅధ్యక్షుడు బబ్బన్‌తివారి "రైతాంగాన్ని ఏకంచేసి సామ్రాజ్యవాద, భూస్వామ్యవ్యవస్థ ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పునాదుల్ని నాశనంచేయడమే" సంస్థ ఆశయాలు అన్నాడు- ప్రజలకు రాజకీయపార్టీల్లో విశ్వాసం నశించడంవల్లే సభ ఏర్పాటయ్యింది అన్నాడు- అతడు ఇది చట్టవిరుద్ధమైన రహస్య సంస్థకాదని స్పష్టంచేసాడు- ఇది రాజ్యాంగంలో పొందుపరచబడి, అమల్లోలేని పౌరుల హక్కులు రైతులకు కావాలనే చట్టపరిధిలో చట్టబద్ధంగా ఉన్నసంస్థ.

కిసాన్‌సభ సంఘవ్యతిరేక తీవ్రవాదసంస్థఅని, సమాంతర ప్రభుత్వం నడుపుతూ హింసను అమలుపరుస్తున్న సాయుధ నక్సలైట్లసంస్థఅనే అభిప్రాయం రాష్ట్ర ప్రభుత్వంతోపాటు స్థానికపాట్నాపత్రికలకు కూడాఉంది.

డిమాండ్లు : వీళ్ళడిమాండ్లు నాలుగురకాలు- ప్రాథమికహక్కులైన యూనియన్ పెట్టుకునేహక్కు, రాజ్యాంగంలోని ఆదేశసూత్రాలయిన సరియైన జీవన విధానం, మానభంగం, దోపిడీలకు క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్‌కు సంబంధించిన శిక్షలు ప్రభుత్వం ఏర్పాటుచేసిన చట్టాలు నిబంధనలననుసరించి కనీసవేతనం, అదనపు భూమిని పంచిపెట్టడం. చాలామంది గ్రామస్థులతోజరిగిన మా ఇంటర్వ్యూల్లో అందరూ ఈ డిమాండ్ల రాజ్యాంగ స్వభావాన్ని నొక్కిచెప్పారు.

పోరాటరూపాలు : వీటిలో సభలు, ఊరేగింపులు, ఘెరావ్‌లు, సమ్మెలు, గ్రామంమొక్క సమస్యలు చౌపాల్ మీటింగ్‌లనబడే పంచాయితి పద్ధతుల్లో పరిష్కారానికి ప్రయత్నించడం ముఖ్యమైనవి.

దాదాపు 18 గ్రామాల్లో ఘెరావ్‌లు, సమ్మెలు జరిగాయి. వాటితోపాటు సభ వాళ్ళ ప్రచారంకోసం సాంస్కృతిక కార్యక్రమాలనుకూడా చురుకుగా నిర్వహించింది.

ఒక ప్రత్యేక సంఘటనకు స్పందించి ప్రజలు, అకస్మాత్తుగా అలజడి చేసారే కాని మొదటే ప్లానుప్రకారం అలజడి జరిపిన సంఘటనలకు ఆధారాలేమీ దొరకలేదు. చాలా ముఖ్యమయిన పోరాటరూపం చౌపాల్ మీటింగ్‌లు. ఈ మీటింగుల్లో గ్రామ పేదప్రజలు చిన్న దొంగతనాలనుంచి, దీర్ఘకాలిక భూమితగాదాలవరకు చాలా సమస్యలు పరిష్కరిస్తారు. భూస్వాములతో ఉండేసమస్యలు కూలిపెల్లించడం వంటివి. లంచగొండి, అసమర్థులైన ప్రభుత్వ అధికారులతోసమస్యలు కూడా తీసుకుని ఒక నిర్ణయా

నికి వస్తారు. పేదలను పీడిస్తున్న సాంఘిక దురాచారాలను కూడా తాగుడు, జూదం స్త్రీలను హింసించడం, అక్రమశారీరక సంబంధాలు, తగాదాలు పరిష్కరిస్తారు. దొంగతనం, దోపిడీ, మానభంగం, మతకల్లోలాలు, గుండాయిజం లాంటి సాంఘిక నేరాలుకూడా తీసుకుంటారు. నేరస్థులకు వేసేశిక్షలు క్షమాభిక్షనుండి సాంఘిక బహిష్కరణ వరకు పెరిగిపోయిన నేరాలను పరిష్కరించలేకపోవడం, పోలీసులపై, న్యాయ వ్యవస్థపై నమ్మకం పోవడం చౌపాల్ ఏర్పడ్డానికి కారణంగా కనిపిస్తున్నాయి. విక్రమ్ బ్లాకులో 1980 లో 15 మానభంగాలు, 7 హత్యలు జరిగాయి ఎవ్వరికీ చట్టప్రకారం శిక్షలువేయలేదు చౌపాల్‌లు ఏర్పాటుచేసిన తరువాత నేరాలసంఖ్య తగ్గింది. 1981లో ఈ బ్లాకులో మానభంగంకాని, హత్య జరిగినట్టుకాని రికార్డు కాలేదు. "ఈ చౌపాల్‌ల వల్ల ఈ ప్రాంతంలో పోలీసుల అవసరం లేకుండాపోయింది." అని లోక్‌దళ్ నాయకుడు జబీర్ హుస్సేన్ అన్నాడు.

ఈ చౌపాల్‌లనే ప్రభుత్వం సమాంతర ప్రభుత్వాలని ఆరోపిస్తున్నది. మసౌరి బ్లాకు డి.ఎస్.పి "సమాంతర ప్రభుత్వానికి స్వయంగా సుప్రీంకోర్టు ఉన్నది. దాని ప్రధానమంత్రి శ్యామ్‌నారాయణ్ పటేల్ (బిపికెఎస్ జిల్లా ఉపాధ్యక్షుడు) అని అన్నాడు. 24 సెప్టెంబర్‌న 'ఇండియన్ నేషన్' అనే పాట్నా దినపత్రిక నక్సలైట్లు పాట్నాజిల్లాలోని తొమ్మిది బ్లాకులలో 'సమాంతర ప్రభుత్వం' ఏర్పాటుచేసి ఆధునిక ఆయుధాలు ధరించి భూస్వాములదగ్గర పన్నులు వసూలుచేస్తున్నారని ప్రముఖంగా ప్రచురించింది 13 అక్టోబర్‌న 'ప్రదీప్' అనే ఇంకొక పాట్నా దినపత్రిక కిసాన్‌సభ తన శాఖలకు భూస్వాముల నుంచి పన్నులువసూలు చేయమని రాసిన ఉత్తరాలనిచెప్పి వాటి ఫోటో స్టాట్ కాపీలను ప్రచురించింది. కిసాన్‌సభ తను సమాంతర ప్రభుత్వం నడుపుతున్నదన్న ఆరోపణను ఖండించింది. దినపత్రికలో వేసిన ఉత్తరాలు దొంగసంతకాల నకిలీ ఉత్తరాలని బబ్రుస్‌తివారి చెప్పాడు. అతడు ఈసంస్థ చందాలు, విరాళాలతో నడుస్తున్నదని చెప్పాడు చౌపాల్‌లు గ్రామీణ సాంప్రదాయకమైన ఆచారమని ఆయన అన్నాడు.

పోరాటక్రమంలో నిర్మాణాత్మకమైన పోరాటం ద్వారా కిసాన్‌సభ వేతనాలు పెరిగేట్టు చేయగలిగింది.

కిసాన్‌సభ ఉద్యమం - భూస్వాములు భూస్వాములు పోలీసులతో కుమ్మక్కయి పేదప్రజలమీద దౌర్జన్యం సాగించడంలో సఫలమవుతున్నారు. విక్రమ్‌లో 22 అక్టో

బర్‌న వీళ్ళు సాయుధ ఊరేగింపు నిర్వహించారు 1970 ల చివర వృద్ధిచెందుతున్న పేదప్రజల సంఘటిత శక్తిని ఎదుర్కోవడానికి ఈ ప్రాంతంలో భూస్వాములు భూమి సేన కింద సంఘటితమయ్యారు. సెప్టెంబర్ చివరి వారంలో కిసాన్‌సభ ప్రదర్శన జరగడంవల్ల బిక్రమ్‌అంతా 1వ అక్టోబర్ నుండి 144 సెక్షన్ అమల్లోవుంది. అయినా 22 అక్టోబర్‌న భూమిసేన 3 వేలమందితో నిషేధాజ్ఞలు ఉల్లంఘించి ప్రదర్శనజరిపింది. ప్రత్యక్షసాక్షులు మాతో ఊరేగింపులో ఒక ఏనుగు, 2 గుర్రాలు 4 జీపులు ఉన్నాయని కనీసం వందమంది ప్రదర్శకులు రైఫిళ్ళు, పిస్తోళ్ళు, ఈటెలు ధరించారని చెప్పారు. వాళ్ళు "ఫసల్ కాటేంగే ఖేతియోం మే. ఆగ్ లగేంగే ఝోపిరియోం మే," పొలాల్లో పంట పండుతుంది - (కూలీల) గుడిసెలకు మంట అంటుకుంటుంది. 'నక్సలియోంకి ఏక్ దవాయి ఛె ఇంచ్ చోటా కర్ దో భాయి' అనే నినాదాలిచ్చారు. (నక్సలైట్లకు ఒకటే మందు - ఆరు అంగుళాల ముక్కలుగా నరికెయ్యడం) ఈ చట్టవిరుద్ధమైన ఊరేగింపుకు రక్షణగా దానివెంట పోవడమేగాక పోలీసులు కరపత్రాలు పంచిపెట్టి నినాదాలిచ్చారని ప్రత్యక్షసాక్షులు చెప్పారు.

ఉద్ధోసింగ్ అనే అతని ఉత్తరంవల్ల ఉత్తేజితులై భూస్వాములు ఈచట్టోల్లంఘనంచేసినట్టు తెలుస్తున్నది. సైక్లోస్టైల్‌చేసి 6 అక్టోబర్‌న భూస్వాములకు పంచిపెట్టబడిన ఈ ఉత్తరం ఒకటి కమిటీకి దొరికింది అందులో హిందీలో ఇలా ఉంది. "మీరు రక్షణకోసం సంఘటితంకండి. పాలనాయంత్రాంగం మిమ్మల్ని రక్షించదు. ఫుల్‌వారి, ఫటువాలో భూమిసేన ఏర్పడి పోరాటానికి సిద్ధంగా ఉన్నది.... నేను ఉపేంద్రబాబుతో మాట్లాడాను (పాట్నాజిల్లా కాంగ్రెస్ నాయకుడు), నేను అతనితో ఈ పాలనాయంత్రాంగం మమ్మల్ని రక్షించలేదు, మేము గ్రామాలకుపోయి రైతులను సంఘటితపరిచి వాళ్ళ శక్తులను పొందేట్టు చేయాలి అని వాదించాను.... అతడు మిమ్మల్ని కలిసాడనుకుంటాను".

రాజకీయనాయకులకు, ఇందిరాకాంగ్రెస్, పోలీసు, అధికారులు, భూస్వాముల కూటమికి ఇంతకంటే వేరేవ్యాఖ్యానాలవసరంలేదు.

రాజకీయపార్టీల చరిత్ర: గత వ్యవసాయక ఉద్రిక్తతలలో కాంగ్రెస్ తప్ప మిగతా రాజకీయ పార్టీలపాత్ర అనుమానాస్పదంగా ఉంది. ప్రభుత్వాధికారంలో ఉన్న వివిధరకాల వారి సహాయంతో, ప్రత్యక్షంగా భూస్వాములతో కాంగ్రెస్ చేతులు కలిపింది భూస్వాముల ఊరేగింపులో ముఖ్యంగా పాల్గొన్నది దివాకరశర్మ, జయప్రకాశ్

సింగ్ (కాంగ్రెస్), సుభాష్‌చంద్రసింగ్ (పాట్నాజిల్లా బిజెపి ఉపాధ్యక్షుడు), సిద్ధేశ్వర్‌సింగ్ (సిపిఐ) వీళ్ళతోబాటు స్థానికలోకదళ్ నాయకులున్నారు. దీనికి విరుద్ధంగా రాష్ట్రంలోని అన్ని ప్రతిపక్షాలు భూస్వాముల- పోలీసుల అణిచివేతను ఖండిస్తూ పేదలకు తమ సానుభూతిని వ్యక్తంచేసాయి.

ప్రతిపక్ష నాయకులలో మేము లోకదళ్ నాయకుడు జాబీద్‌హుస్సేన్‌ను కలిసాము- అతడు తనపార్టీ పాలసీకి విరుద్ధంగా స్థానిక కార్యకర్తలు భూస్వాముల ఊరేగింపులో పాల్గొన్నారని ఆరోపించాడు- స్థానిక బిజెపి నాయకుడిని మసౌరి డి ఎస్ పితో ఉన్నప్పుడు కలవడంజరిగింది- ఆయన డి ఎస్ పి ఆరోపణను 'సాయుధ నక్సలైటుదళాలు', సమాంతర ప్రభుత్వఉనికిని బలపరిచాడు- ఈ సంఘటంలో సి పి ఐ పాత్ర చాలా కుట్రతో కూడిఉంది. స్థానిక వార్తాపత్రిక 'ప్రదీప్' పార్టీ జిల్లానాయకుడు ఊరేగింపులో ఉన్నట్టురాస్తే, రాష్ట్ర పార్టీనాయకత్వం వెంటనేదాన్ని నిరాకరించింది- కాని జాబీర్‌హుస్సేన్‌తో, గ్రామస్థులతో మేంచేసిన ఇంటర్వ్యూలో అతడు ఉన్నట్టేతెలిసింది. పార్టీ రాష్ట్రకమిటీతరఫున చతురానన్‌మిశ్రాచేసిన విచారణలో ఊరేగింపులో ఇద్దరు సిపిఐ నాయకులున్నట్టు వాళ్ళను బహిష్కరించమని కోరినట్టు తెలిసింది. నారితి గ్రామస్థులు మాకు స్థానిక సిపిఐ యం ల్ ఏ రామనాథ్ యాదవ్ వాళ్ళగ్రామంలో వాళ్ళకు సానుభూతిచూపించాడని కాని దగ్గరలోనున్న సోతంపూర్‌లో భూస్వాములకు మద్దతిచ్చాడని చెప్పారు,

ముఖ్యసంఘటనలు : పాట్నాలో అశాంతికి కారణంఅయిన నాలుగు ముఖ్యమైన సంఘటనలుఇవి- 24 సెప్టెంబర్‌న బిక్రమ్‌లో ఊరేగింపు, 30 సెప్టెంబరున లాహసున గ్రామంలో మానభంగం, తరువాతి సంఘటన, లాహసునలో అరెస్టులు, 3 అక్టోబరున నాద్‌వాన్ రైల్వేస్టేషన్ దగ్గరజరిగిన సంఘటన, నరిహా, పిరిహి గ్రామాల్లో పోలీసుకాల్పులు. కమిటీ ఈ అన్నిప్రాంతాలుతిరిగి ప్రత్యక్ష సాక్షులను ఇంటర్వ్యూచేసి ఈకింది అంశాలను కనుగొన్నది.

సెప్టెంబర్ 24న కిసాన్‌ర్యాలీ సందర్భంలో టాంగోర్‌సాహు అనే అతనిని స్థానికభూస్వామి సేవకుడు భోలాసింగ్ ప్రోద్బలంవల్ల మారణాయుధాలున్నాయని అరెస్టుచేసారని ప్రజలుచెప్పారు. ప్రజలు పోలీస్‌స్టేషన్ చుట్టుముట్టి అతన్ని వదిలిపెట్టాల్సిందిగా డిమాండ్‌చేసారు. చివరకు వాళ్ళను ఎదుర్కోలేక సాహూను వదిలిపెట్టారు. పోలీసులు స్టేషన్‌మీద దాడిచేసినవాళ్ళు తీవ్రవాదులని చెప్తున్నారు.

మసౌరి బ్లాకులోని గ్రామం లాహిసునలో 26 సెప్టెంబర్న కిషోరిసింగ్ అనే భూస్వామి ఫెక్నీదేవిఅనే స్త్రీని మానభంగం చేయడంతో అలజడి మొదలయ్యింది. గ్రామస్థులు కిషోర్ ఇంటిని చుట్టుముట్టి న్యాయంజరుగుతుందని కుర్మీ భూస్వాములు హామీఇవ్వడంతో వెళ్ళిపోయారు. మానభంగం తర్వాత పోలీసులు గ్రామానికి వచ్చి ఫెక్నీదేవిని, కిషోరిసింగ్ను కస్టడీలోకి తీసుకున్నారు. ప్రజలు ఫెక్నీదేవి వాంగ్మూలాన్ని అక్కడే తీసుకొని ఆమెను వదిలిపెట్టాల్సిందిగా పోలీసులను ఘెరావ్ చేసారు. చివరకు ఆమెను వదిలేసి పోలీసులు సింగును జీపులో తీసుకపోయారు. పోలీసులు కిషోరిసింగ్ను తీవ్రవాదులు మాయంచేసారని ఆరోపిస్తున్నారు. చాలామంది జర్నలిస్టులు అతడు కాంగ్రెస్ నాయకుడు నావల్ కిషోర్సింగ్ ఇంట్లో ఉన్నాడని అన్నారు. ముఖ్యమంత్రి స్వయంగా అతన్ని కలిసాడని తెలిసింది. కిషోరి వయస్సు 40-45 మధ్య ఉండగా అతడిని నిర్దోషిగా నిరూపించడానికి 65 వుంటుందని పోలీసులు పత్రికలు అబద్ధప్రచారం చేస్తున్నాయి. సింగ్ను ఎత్తుకపోయారన్న ఆరోపణతో మసౌరి బ్లాకులో భూస్వాముల సహాయంతో మూకుమ్మడి దాడులు చేసారు. ఫెక్నీ, ఆమె భర్త సాహూను, ఇంకా చాలామందిని అరెస్టుచేసారు. వాళ్ళను విడిపించే ప్రయత్నంచేసే గ్రామస్థులను భూస్వాములు బెదిరిస్తున్నారు. అరెస్టు చేసిన వాళ్ళను రైలులో నాద్వాన్ స్టేషన్నుండి తీసుకపోయారు. గ్రామస్థులు నాద్వాన్ రైల్వేస్టేషన్కు పోయేసరికి రైలువెళ్ళిపోయింది. దాంతో ఉద్రిక్తులైన ప్రజలు స్టేషన్మాస్టర్ రూమును ధ్వంసంచేసారు.

బీహార్ ప్రభుత్వ మిలిటరీ ఆపరేషన్ 30 అక్టోబర్ తెల్లవారుజామున నర్హి, పిర్హి గ్రామాల్లో మొదలయ్యింది. బుల్లిన్ బజార్ పోలీస్స్టేషన్ ఎస్ఐ బలిరామ్‌తివారి వందమంది సాయుధ పోలీసులతో దాడిమొదలు పెట్టాడు. నర్హికివస్తూ దారిలో పోలీసులు హోమియోపతి విద్యార్థి అశోక్కుమార్ను అరెస్టుచేసి తరువాత ధొండుపశ్వాన్ ఇంటికి పోయి తలుపులుపగలగొట్టి లోపలికిపోయి లూటీచేసారు. శ్యామ్సుందర్ ఇంటిమీద దాడిచేసి రెండుటార్చ్‌లు, బ్లాంకెట్, జతబూట్లు తీసుకపోయారు. అంజు (7) అనే బాలిక జయనందన్ (10) అనే బాలుడు తుపాకీకాల్పుల్లో గాయపడ్డారు. ఈ రకంగా ఒక గంటసేపు దాడిసాగింది. పిరిహిలో సురేందర్ మహతో (22) ఇంటితలుపుతట్టి తీయగానే కాల్చిచంపారు. తరువాత చాలా ఇళ్ళమీద దాడిచేసారు. ఆరుగురిని అరెస్టుచేసి రెండుమైళ్ళ దూరంలో తమ వాహనాలున్న బోరామ్‌పూర్ గ్రామంవైపు బలవంతంగా నడిపించుకుపోయారు. చంద్రావతి అనే కొత్తగాపెళ్ళయిన 15 ఏళ్ళయువతి

తనతమ్ముడు భరత్‌ను వదిలిపెట్టమని వాళ్ళవెంటపోయింది. సోహంపూర్ వెళ్ళే దారిలో తరువాత ఆమె శవం కనపడింది. పోలీసులు ఆమెదగ్గర రెండు బాంబులున్నాయని ఒకటి చౌకీదార్ మీదవేసి గాయపరిచిందని అన్నారు. కాని గ్రామస్థులు ఎస్ ఐ బలిరాం చంద్రావతిని కాలుస్తుండగా బుల్లెట్ చౌకీదార్ తొడకు తగిలిందని తరువాత చంద్రావతిని కాల్చిచంపాడని చెప్పారు. వీళ్ళిద్దరినేగాక ఇంకా దాదాపు ఏడుగురిని పోలీసులు కాల్చిచంపారు. దాదాపు 135 మంది గాయపడ్డారు. చాలా మందిని అరెస్టు చేసారు. లక్షరూపాయల విలువగల ఆస్తులను లూటీచేసారు. ఈ సంఘటనలన్నీ సాయుధ నక్సలైట్ల హింసాయుత చర్యలని పోలీసులు చెప్తున్నారు. వాళ్ళుచెప్తున్న ప్రకారమైనా 'నక్సలైట్ దళాల' వల్ల ఒక పోలీసు గాయపడ్డ, చనిపోయిన సంఘటనలేమీలేవు. పోలీస్‌స్టేషన్‌లో విరిగిన కుర్చీలు, రైల్వేస్టేషన్‌లో ధ్వంసం చేయబడినగది, భూస్వామిని ఎత్తుకపోయిన (?) సంఘటన, చంద్రావతి బాంబువేయడంవల్ల చౌకీదార్ గాయపడడం ఇవన్నీ పోలీసులు తమ ఆరోపణలకు ఆధారంగా చూపెడుతున్నారు.

పోలీసు అణచివేత : శాంతిభద్రతలను అమలుపరుస్తున్నామనే పేరుతో పోలీసులు గ్రామీణ పేదప్రజల న్యాయమైన కోర్కెలను అణచివేయడానికి దాడులు జరుపుతున్నారని నమ్మడానికి చాలా ఆధారాలున్నాయి. చాలామందిని రకరకాల కేసుల్లో ఇరికించారు. అన్నిట్లోను నిందితులను నక్సలైట్లుగా చిత్రించారు. వీళ్ళలో చాలామంది కిసాన్‌సభ నాయకులు. కేసుల్లో ఇరికించబడ్డ చాలామందికి వీటితో సంబంధం ఉండే అవకాశాలుకూడాలేవు. ఉదాహరణకి ధన్‌రువా బిహార్ నేషనల్ కాలేజీ డిహూన్‌స్ట్రేటర్ రామకృష్ణతివారిని 24 సెప్టెంబరున బిక్రమ్‌లో జరిగిన రైతుల ర్యాలీలో ఉన్నాడని అరెస్టు చేసారు. నిజానికి ఆసమయంలో అతను కాలేజీలో పాఠాలుచెప్తున్నాడు. అతన్ని 13 రోజులు అక్రమనిర్బంధంలో ఉంచారు. చాలామంది కిసాన్‌సభ కార్యకర్తలమీద వారంట్లున్నాయి. లెక్కలేనన్ని అక్రమఅరెస్టులు జరిగాయి. 135 మందిని మాత్రమే జైలుకు పంపించారు. పియుసిఎల్ తరఫున ఖైదీలను కలిసిన కిషోరీదాస్ అనే సోషల్‌వర్కరు జైళ్ళలో వారికి సరియైన ఆహారం, వైద్యసదుపాయాలులేవని చెప్పాడు. ఇద్దరిని ఉంచే సెల్‌లో 6గురిని ఉంచారు. జైలుకు పంపించేముందు పోలీసు స్టేషన్‌లో వాళ్ళను విపరీతంగా కొట్టడంవల్ల జైలు హాస్పటల్లో చేర్పించారు. వీళ్ళల్లో 10 సం॥ల జయనందన్ కూడా ఉన్నాడు. 3 నవంబరున ఖైదీలు మంచి ఆహారం, ఇతర సదుపాయాలకోసం నిరాహారదీక్ష చేసారు.

పోలీసు ఉన్నతాధికారుల సమావేశం అక్టోబర్ చివరి వారంలో 40 మంది మెజిస్ట్రేట్‌లు, 150 మంది పోలీసు అధికారులతో జరిగింది. కిసాన్‌సభ ఉద్యమాన్ని

అంతటా తుడిచిపెట్టాలనే నిర్ణయంతో దాడులు, లూటీలు ప్రారంభించారు. పాట్నాలో ఇవ్వాళ పోలీసులు 500 మంది కిసాన్ సభ కార్యకర్తలకోసం గాలిస్తున్నారు. పోలీసులకు ఈ కార్యకర్తల జాబితాను భూస్వాములు అందచేసారు.

ఈ రకమైన పోలీసు దాడులు శాంతిభద్రతలను చక్కబెట్టడానికి కాక పద్ధతి ప్రకారం కిసాన్ సభను అణచివేయడానికి చేస్తున్నట్టు కనబడుతున్నది. ఎక్కువమంది పోలీసు అధికారులు భూమిహార్ తెగనుంచి వచ్చినవాళ్ళే. ఇంకా 15 సంవత్సరాలదాకా ఐ జి పి గా ఈతెగనుంచి వచ్చినవాళ్ళే ఉంటారని భావిస్తున్నారు. ఒక సీనియర్ ప్రభుత్వ అధికారి కమిటీతో ఈమధ్యే నియమించిన 1500 మంది బిహార్ మిలిటరీ పోలీసులలో చాలా తక్కువ మంది హరిజనులున్నారని చెప్పాడు. ఇది ఖచ్చితంగా ప్రభుత్వం రిజర్వేషన్ పద్ధతిని ఉల్లంఘించడమే.

<u>బీహార్ ప్రభుత్వపాత్ర</u> : వ్యవసాయక అశాంతి పెరుగకముందునుంచే రాష్ట్ర ప్రభుత్వం భూస్వాములను సమర్థిస్తున్నట్టు కనబడుతున్నది. ప్రభుత్వం తన సీలింగ్ చట్టాలను అమలుపరచడంలో విఫలమైంది. ప్రస్తుత గందరగోళంలో రాష్ట్ర మంత్రి వర్గం పోలీసుల కథనం ఆధారంగా పోలీసులు భూస్వాముల అండగావుండడానికి అనుమతించింది. నక్సలైట్లు శాంతిభద్రతలను ధిక్కరించి సమస్యలు సృష్టిస్తున్నారు కాని ఈ పరిస్థితులు పేదప్రజల దారుణమైన జీవనవిధానంవల్ల వచ్చాయన్నది అబద్ధంఅని బీహారుముఖ్యమంత్రి జగన్నాథ్ మిశ్రా నవంబరు 1న ఒక ప్రకటనచేసాడు. అయినా ఈ ప్రాంతానికి అభివృద్ధిపథకాలను, ప్రస్తుత ఉపశమనానికి కార్యక్రమాలను చేపట్టడం రాష్ట్రప్రభుత్వానికి తప్పనిసరిఅయ్యింది. నవంబరు మొదటివారంలో అభివృద్ధి పథకాలకు 8.75 కోట్లు మంజూరుచేసింది. రాష్ట్రప్రభుత్వం స్థానికప్రజలకు సమాంతర ప్రభుత్వాలున్నాయని ప్రకటనచేస్తూ కేంద్రంతో రేవనిచెప్తున్నది.

చాలా తక్కువమంది ప్రభుత్వ అధికారులు మాత్రం పేదప్రజలపై రాష్ట్ర ప్రభుత్వ అణచివేత విధానాలను వ్యతిరేకిస్తున్నారు. మసౌరి, బిక్రమ్ బ్లాకులలో పోలీసుదాడులను దనాపూర్ సబ్ డివిజనల్ ఆఫీసర్ వ్యతిరేకించాడు. జిల్లా మెజిస్ట్రేటు, ఎస్. పి ఆ దాడులగురించి మొదలే అతనికితెలియకుండా జాగ్రత్త పడ్డారు. అక్టోబరు చివరివారంలో జరిగిన ఉన్నతాధికారుల సమావేశంగురించి, జరపబోయే పోలీసుచర్యలగురించి అణచివేతలను వ్యతిరేకించే అధికారులు పత్రికలవారికిచెప్పి వార్తలు బయటకువచ్చేట్టు చేసారు. ఇటువంటి అధికారులను వేరేప్రాంతాలకు బదిలీ చేస్తున్నట్టు మాకుతెలిసింది. ఈ అధికారులనుకలిసే అవకాశం కమిటీకి కలిగింది.

ఉన్నతకులాల్లోంచి వచ్చిన సీనియర్ అధికారులుమాత్రం కిసాన్ సభను అణచి వేయడాన్ని సమర్థిస్తున్నారు. వ్యవసాయశాఖలో ఒక అధికారిఅయిన బిక్రమ్ భూస్వామి మాతో "ఇక్కడికి రెండుసంవత్సరాల తరువాతరండి. మీకు అంతా ప్రశాంతంగా కన పడుతుంది" అని అన్నాడు.

ప్రశాంతతకి అర్థంఏమిటో ప్రభుత్వ పథకాలద్వారా తెలుస్తుంది. ప్రభుత్వం పాట్నా, గయ, ఔరంగాబాద్ జిల్లాల్లో 16 రోడ్లు అభివృద్ధిచేయడానికి 5 కోట్లు కేటా యించింది. పక్కారోడ్లు లేనందున గ్రామాల్లోకి జీపుల్లో పోవడానికి తమకు ఇబ్బం దవుతున్నదని సీనియర్ పోలీసు అధికారులు మాతోఅన్నారు. రోడ్లువేయడంవల్ల గ్రామప్రజలకుండేలాభం ఎలాఉన్నా పోలీసులు చురుకుగా తిరగడానికి పనికొస్తాయి.

ప్రభుత్వం భవిష్యత్ కార్యక్రమంలో పోలీసు యంత్రాంగంతో గయ, ఔరంగాబాద్ జిల్లాల్లో కిసాన్ సభను అణిచివేయడం ఒకటి అని ఒక సీనియర్ అధికారి మాతో చెప్పాడు. 1975-76లో బీహార్ లోని భోజ్‌పూర్, తదితరజిల్లాల్లో జరిగిన 'ఎన్‌కౌంటర్ల'లాగే 150 మందిని చంపివేయడానికి రాష్ట్రప్రభుత్వం నిర్ణయించు కున్నట్టు తెలిసింది.

కనుక, బీహార్ ప్రభుత్వం, ప్రస్తుత వ్యావసాయిక ఆందోళనకున్న సాంఘిక ఆర్థిక మూలాలను విస్మరిస్తూ, ప్రజల ఆకాంక్షలను అణచివేసే పాతవిధానాన్నే అనుస రిస్తూ ఇంకా ఎంతో విశాలప్రాంతంలో 'శ్మశానశాంతి' స్థాపించేప్రయత్నం చేస్తున్నది.

<u>సిఫారసులు</u> : పైనకనుగొన్న వాస్తవాల ఆధారంగా కమిటీదేశంలోని ప్రజా స్వామ్యవాదులకు ఈ క్రింది సిఫారసులు చేస్తున్నది.

1. బీహార్ రాష్ట్రప్రభుత్వం గ్రామీణ పేదప్రజలకు ఉపయోగపడే తన చట్టాలను అమలుచేసేట్టుగా ఒత్తిడిచేయాలి.
2. అరెస్టుచేయబడ్డ పేదరైతులు, వ్యవసాయకూలీలకు సహాయంచేస్తూ వాళ్ళ విడుదలయ్యేందుకు ప్రయత్నాలుచేయాలి.
3. ప్రతి ప్రజాస్వామ్యఉద్యమానికి ముద్రవేసి అణచివేయడానికి రాష్ట్రప్రభుత్వం ఇష్టంవచ్చినట్టు ఉపయోగించకుండా ఉండడానికి 'తీవ్రవాదులు', 'నక్సలైట్లు' అన్న పదాలు నిర్వచించాలని పార్లమెంటును, కోర్టులను అడగాలి.
4. స్థానికపత్రికల్లో వచ్చిన బాధ్యతారహితమైన వార్తలపై ప్రెస్‌కౌన్సిల్, జర్న లిస్టుల సంస్థలు విచారణ జరపాలి.
5. 150 మంది కిసాన్ సభ కార్యకర్తలను చంపివేయాలనే ప్రభుత్వ నిర్ణయం అమలుజరగకుండా, వాళ్ళ ప్రాణాలు కాపాడడానికి పత్రికలు, పార్లమెంట్, ప్రజలందరూ పూనుకోవాలి.

(స్వేచ్ఛానువాదం : గోపి)

సమీక్షావ్యాసం :

# వచన కవిత - విప్లవ కవిత్వం

జె. సి.

పెట్టుబడి, దాని కనుగుణమైన ఉత్పత్తి సంబంధాలు లేక సామాజిక సంబంధాల నుండి ఆధునిక కవిత్వం ఆవిర్భవించింది. దాని ప్రస్తుతరూపాలు వచనకవిత, సినిమా పాట అని చెప్పుకోవచ్చు.

మార్క్స్ చెప్పినట్లు ఏసాంఘిక వ్యవస్థైనా దానిలోని ఉత్పత్తిశక్తులు అవకాశం ఉన్నంత మేరకు అభివృద్ధి జరుగకుండా నశించిపోదు. అయితే ఉన్నతమైన కొత్త ఉత్పత్తి సంబంధాలు, వాటికి కావలసిన భౌతిక పరిస్థితులు పాతసమాజగర్భంలో పరిపక్వంగాకుండా ఉద్భవింపబోవు. అలాగే కవిత్వం గూడ ప్రస్తుతసామాజిక వ్యవస్థకు అనుగుణమైన అనేకరూపాల్ని, రీతుల్ని అనుసరించకుండా మారదు. ఈ వ్యవస్థలో ఆపెరిగ్రికి ఎంత అవకాశం ఉంటే అంతవరకూ విజృంభిస్తుంది. ఈనాటి మినీకవిత అలాంటిది.

అలాగే ఉన్నతమయిన కొత్త ఉత్పత్తి సంబంధాలకు- అనగా సామాజిక సంబంధాలకు కావలసిన భౌతికపరిస్థితులు పాతసమాజ గర్భంలో పెరిగినట్లే ఆ భౌతిక పరిస్థితులతోబాటు విప్లవ కవితారీతులు గూడ అభివృద్ధి చెందుతాయి. విప్లవాత్మక సామాజిక సంబంధాల క్రోడీకరణకు రూపంగా విప్లవ కవిత్వం, విప్లవ సాహిత్యం ఆవిర్భావం చెందుతాయి. ఈ భౌతికపరిస్థితులే విరసం పుట్టుకకూనాంది. విరసం భావాలననుసరించి రాయబడే కవిత్వానికీ మూలం

విరసం పుట్టుకకుముందు అలాంటి భౌతిక పరిస్థితులులేవా ? అంటే ఉన్నాయనే చెప్పాలి లేకపోతే శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలు 1937 లో రాష్ట్ర. అయితే, వాటికి విరసం పుట్టుకనాటి పరిస్థితికి ఈనాడున్న పరిణతిలేదు. అట్టడుగు ప్రజల బతుకే ఆ పరిస్థితుల కాధారం. కాని అప్పటి పరిస్థితుల్లో ఉద్భవించిన సామాజిక సంబంధాలు తెలుగుదేశంలో, తెలంగాణా పోరాటాన్ని మినహాయిస్తే, పోరాటస్థాయికి ఎదగలేదు. నక్సల్‌బరీ, శ్రీకాకుళ పోరాటాల్తో అవి పరిపక్వస్థితికి వచ్చాయి.

శ్రీశ్రీ తరానికి ముందు తెలుగుదేశంలో కవిత్వరూపం ముఖ్యంగా ఫ్యూడల్ రూపమైన పద్యాలే. అక్కడక్కడ బూర్జువా రూపమైన వచన కవిత ఉన్నప్పటికీ, తెలుగు కవిత్వం శ్రీశ్రీతోటే భూస్వామ్య, బూర్జువా వ్యాపారనాగరికత అనబడే ధృతరాష్ట్రుని కౌగిలినుండి కొంచెంగాసడలి శ్రీవ.జీవన సౌందర్యాన్ని చేరుకోవడం

మొదలుపెట్టింది. అందువల్లనే శ్రీశ్రీ కవిత ఫ్యూడల్, బూర్జువా రూపాల్ని భాష, ప్రతీకల విషయంలో పూర్తిగా విదుల్చుకోలేకపోయినా శ్రమశక్తికి పర్యాయపదంగా, స్వేచ్ఛకు మారుపేరుగా మారటం మొదలుపెట్టింది. ఛందస్సు, వ్యాకరణమనే సర్ప పరిష్వంగాల్నుండి విడివడి పాటకు దగ్గరైన మాత్రాఛందస్సును, విప్లవభావాల్ని చేరుకుంది. కాని శ్రీశ్రీ కవిగా అత్యంత ప్రతిభావంతుడైనప్పటికీ విప్లవాత్మకమైన భౌతిక పరిస్థితుల కాధారమయిన ప్రజల బతుకునుండి దూరంగా ఉన్నవాడు. అందుకే ఆయన కవిత్వం శివసాగర్, గద్దర్‌ల కవితల్లాగ ఉన్నత ప్రమాణాలనందుకున్న విప్లవ కవిత్వం కాలేకపోయింది

తెలుగుదేశంలో దాదాపు ఒకతరంపాటు కవులు శ్రీశ్రీ కవిత్వంతో ఉత్తేజితులై కవిత్వం రాసినవాళ్ళే వాళ్ళలో చాలామందిని సూటిగా కదిలించింది- విప్లవాత్మకమైన భౌతికపరిస్థితులుకావు పోరాటం అసలేకాదు. వారికి ఉత్పత్తి సంబంధాలు, సామాజిక వ్యవస్థగురించిన సిద్ధాంతావగాహనలేదు. అయినా విప్లవకవిత్వాన్ని అనుకరించే ప్రయత్నంవల్ల వారికవితల్లో విప్లవ కవిత్వాభాస రూపొందింది. అలాంటి కవుల్లో అగ్రగాములైనవారు శ్రీరంగం నారాయణబాబు, గుంటూరు శేషేంద్రశర్మలు ఆతెగకేచెందిన సినారె మొదట మాత్రాఛందస్సుల్లో కొంతకాలంరాసినా చివరకు వచన కవితనే ఆశ్రయించుకొన్నాడు. (శ్రీశ్రీకూడ ఖడ్గసృష్టిలాంటి సంకలనాల్లో వచన కవితరాసినా వ్యంగదోరణి (Parody) నవలంభించి రాసిందేనని చెప్పవచ్చు)

తెలుగుదేశంలో పరిపక్వమౌతున్న విప్లవాత్మక భౌతికపరిస్థితులకు స్పందించి, స్పష్టమైన సిద్ధాంతబలంతో పోరాటమనే అత్యున్నత సామాజిక సంబంధంతో ముడివడి శ్రమజీవులకై కవిత్వంరాసినవారు సుబ్బారావు పాణిగ్రాహి, శివసాగర్, గద్దర్, చెరబండరాజు, వంగపండు, వరవరరావులు. అయితే, వచనకవిత అనబడే బూర్జువా కవితారూపాన్ని వదలనివారు, శ్రీశ్రీలాగ శ్రమజీవుల జీవితంతో ప్రత్యక్ష సంబంధంలేకుండా కవిత్వం రాసినవారు పాటను విప్లవాత్మక సామాజిక సంబంధాల వ్యక్తీకరణకై ఉపయోగించుకున్నప్పటికీ అత్యున్నత స్థాయికిచెందిన విప్లవకవిత్వాన్ని రాయలేకపోయారు. ఇప్పటికీ ఈ రకమయిన కవిత్వం ఎక్కువమోతాదులోనే వస్తున్నది.

కాని ఎక్కువమంది విప్లవకవులు వచన కవితారూపాన్ని చేపట్టినా వారి కవిత్వంలో కవితారూపంలో భాగమేఅయిన ప్రతీకలు, భావచిత్రాలు విప్లవాత్మక భౌతిక వాస్తవికత, సామాజికసంబంధాల అవగాహన, చైతన్యంనుండే పెగుల్చుకువస్తాయి

కాబట్టి దానికి విప్లవకవిత్వలక్షణాలే ఎక్కువ. ఇవేవీలేక కేవలం సిద్ధాంతావగాహన మాత్రమేఉంటే వారికవిత్వం శుష్కనినాదప్రాయమవుతుంది.

కవిత్వమంతా పాటలరూపంలోనే ఉండాలన్న కఠిననియమం ఏమీలేదు. ఐతే విప్లవ కవిత్వభాష వచనంకాదు. అసలు కవిత్వభాషే వచనంకాదు- అది శ్రమజీవులు మాట్లాడుకొనే జీవభాష- శ్రమనుండిపుట్టి శ్రమజీవికీ అతనిచుట్టూఉన్న భౌతిక ప్రపంచానికీ మధ్యగల సంబంధంనుండి వికసించిన ఉత్కృష్టమైన అభివ్యక్తి (heightened expression) అది ఇక బూర్జువాసమాజంలో వాడేభాష శ్రమనుండి వేరైన పెట్టుబడి, పెట్టుబడినుండిపుట్టిన సామాజిక సంబంధాల మొత్తానికి ప్రతిరూపం. అది పుస్తకాల్లోరాసే, విద్యావంతులు మాట్లాడే అసహజరూపం- అందుకే వచనకవితా రూపం నిర్జీవమైన యాంత్రిక బూర్జువా మార్కెటు సంబంధాలను వ్యక్తికీ సమాజానికి ప్రకృతికీ మధ్యగల చైతన్యశీలమైన గతితార్కిక సంబంధాన్ని అర్థరహితమైన సరుకులమార్పిడి సంబంధంగా మార్చడానికి చేసే ప్రయత్నాలను మాత్రమే సూచిస్తుంది- ఈ ప్రయత్నాలు లేక సంబంధం భౌతిక వాస్తవికతకు అసహజమయిన వికటరూపం (Parody) ఇంకో విధంగా చెప్పాలంటే వచన కవిత భౌతికవాస్తవికత నుండి పరాయీకృతమైన కవితారూపం. అంతకైతే విప్లవకవిత్వంలో వచనకవితను ఒక వ్యంగరూపంగా ఉపయోగించుకోవచ్చు. శ్రీశ్రీ, శివసాగర్లు వారి వచన కవితల్లో చేసిన ప్రయత్నమదే అనుకుంటాను. నిజమైన కవిత్వానికి (అది విప్లవాత్మకమైంది) వచనకవిత వికటరూపమైనందువల్లనే, వచనకవితలో విప్లవ కవిత్వాన్నిరాస్తే దానిలో ప్రధానంగా వ్యంగ్యధోరణే వ్యక్తమయ్యే ప్రమాదంఉంది అందువల్లనే సీరియస్ కవిత్వంగా రాయబడిన ఆధునిక వచనకవితలో - ముఖ్యంగా ఇంగ్లీషు కవిత్వంలో - వ్యంగం (Irony), వైరుధ్యం (paradox) , మరియు అస్పష్టత (ambiguity) ల పాత్ర నిజమైన కవిత్వానికీ, వచనకవితకు మధ్యగల వ్యంగ్యాత్మక వికటసంబంధంవల్లనే వచ్చిందని చెప్పుకోవచ్చు.

కవిత్వం గురించిన ఈరకమయిన అవగాహనతో పరిశీలించినట్లయితే "నమ్మి" (గోదావరిలోయ), దేవీప్రియ (అమ్మచెట్టు), జైరామ్ (ఎర్రగాలి), బి పాండు రంగారెడ్డి (సంకెళ్ళు తెంచుదాం) ఈ నల్గురుకవులూ మార్క్సిస్టుసిద్ధాంత ప్రాతిపదికగా విప్లవాత్మక భౌతికపరిస్థితులలో ఉద్భవిస్తున్న ఉన్నతమైన కొత్త సామాజిక సంబంధాల ప్రేరణవల్ల కవిత్వం రాసినవారే. ఆ ప్రేరణ వారివారి అనుభవంలోకి వచ్చిన భౌతిక వాస్తవికత, పోరాటంతో వారికున్న సంబంధాన్ననుసరించి వివిధ స్థాయిల్లో వారికవితల్లో ప్రస్ఫుటించింది.

## గోదావరిలోయ

"నమ్మక" కవితాసంకలనానికి అతని కవితల మాదిరిగానే త్రిపురనేని మధు సూదనరావుగారు, శివారెడ్డిగారు రాసిన రెండు మంచి ముందుమాటలున్నాయి. మధుసూదనరావుగారు చెప్పినట్లు "నమ్మక" కవిత్వంలో అతను వచన కవితరాసినా, పాటరాసినా మినీకవిత రాసినా అన్నిటిలోనూ వస్తువు విప్లవపోరాటాలే". పోరాటమనే అత్యున్నతమైన విప్లవాత్మక సామాజిక సంబంధంగురించి రాసిన ఈ కవికి భౌతిక పరిస్థితుల గురించిన అవగాహన, అనుభవం, కవితాశిల్పం ఏమేరకు అతని కవిత్వంలో ప్రతి ఫలించాయోచూద్దాం. ముందు వచనకవితలు, మినీకవితలు. ఈ కవికి ప్రేరణకు ప్రతీక గోదావరి. ఈ జీవనది ప్రజల జీవితానికీ, పోరాటానికీ భావచిత్రం.

శివారెడ్డిగారన్నట్లు పోరాటమే మానసిక వాతావరణమైన "నమ్మక" శ్వాస నిండా గోదావరిలోయే. అతనికి గోదావరిఅలలు

పోటీగాతోసుకొచ్చి....
నక్సల్బరి, శ్రీకాకుళం వీరగాథల్ని వినిపిస్తయ్
తెలంగాణాస్మృతుల్నాలపిస్తయ్
అల్లలై ఒడ్డునుఢీకొనే నెత్తుటిచారల నాబింబం
చెట్టుకుఅప్పిన ఆయుధాన్ని మళ్ళీ నాచేతికిస్తుంది. ("గోదావరిలోయ")

ఒక విప్లవకారునిఊహలో ప్రకృతి, సమాజం, పోరాటం ఎంతఅవిభాజ్యంగా పెనవేసుకుని అతనికవితకు ఊపునూ, ఉత్తేజాన్నీ యివ్వగలవో గ్రహించడానికి ఈ ఉదాహరణచాలు. ఇంతటి నిశితమైనఊహకు, నిశితమైన ఆలోచన, అవగాహన అవసరం. ఈ అవగాహన, ఆలోచనగల కవే తన అనుభవంలోని భౌతికపరిస్థితుల వర్ణించేప్పుడు స్పష్టమైన వాడియైన భావచిత్రాల్ని సృష్టించగలడు- ఈ కవితలోనే "నమ్మక" అంటాడు.

విద్రోహించిన నిమ్మపల్లి కొదురుపాకలు
బరిపైలైన సిరిసిల్లాలు
ప్రజాపంథా ప్రవాహపుగర్జనల్ని ప్రతిధ్వనిస్తున్నయ్.

ఇదేవిధంగా, ఇంద్రవెల్లిలో పై వర్గాలవాళ్ళు, సర్కారువాళ్ళుజరిపిన, జరుపు తున్న కిరాతకం తరువాత అక్కడి వాతావరణాన్ని, గోండుల మనఃస్థితిని, గోండుల బ్రతుకు అనగా వారిజీవిత భౌతికపరిస్థితుల్లో సారింపబడ్డ నిశ్శబ్దాన్ని కళ్ళకుకట్టినట్లు వర్ణిస్తాడు, "ఇంద్రవెల్లి"అన్న కవితలో.

కడుపుల్లోకి చీల్చుకుపోయిన బుల్లెట్లబాధకన్న
నేలతల్లినుండి ఎడబాటుచేసేకుట్ర బాధాకరమయినది.

గోండు రైతులకూ భూమికీ మధ్యగల ప్రియాతి ప్రియమైన సంబంధం, ఈ సంబంధంవల్ల వచ్చిన స్వేచ్ఛను తుంచేందుకు దోపిడీవ్యవస్థ చేసేకుట్ర, ఆ కుట్రకు మద్దతుగా సర్కారీ బుల్లెట్లు- అంటే శ్రమజీవులకూ, దోపిడీదారులకూ వారిప్రభుత్వానికీ మధ్యగల దోపిడి సంబంధం- చివరగా ఆ కుట్రకు, బుల్లెట్లకు భయపడకున్నా వాటినిచూసి బాధపడే గోండుల మానవత్వం, ఇన్నివిషయాల్ని క్లుప్తంగా రెండు లైన్లలో ప్రస్తుతసామాజిక సంబంధాల్నుండి సహజంగా పుట్టిన ప్రతీకల్లో (కడుపు, నేలతల్లి, బుల్లెట్లు) నిశితంగా సూచించారు కవి. అలాంటి కవితా చిత్రాలే

జులుం సహించని ఎలుగెత్తినగాలి
జులూస్ తీసేందుకు సిద్ధమైనిల్చుంది
గూడెం గూడెం సుడిగాలై గూడుపుఠాని కుట్రని
పడగొట్టేందుకు సన్నద్ధమైనయ్.

ఈ విధంగా కవి తన సామాజిక సంబంధాల అవగాహనను విప్లవాత్మక భౌతిక పరిస్థితులను తదనుగుణమైన ప్రతీకల్లో, భావచిత్రాల్లో వర్ణించబట్టే ఈ రెండు కవితల్లో చాలావరకు వచనరూపం కవిత్వానికి ప్రతిబంధకం కాలేదు. వాటివల్ల వచనం కూడా కొంతవరకు తన వచనలక్షణాన్ని వదులుకుంది. కాని పాటల్లో ఈ పరిస్థితులే ఇంకా గొప్పగా వ్యక్తమైనాయి. "పోరుజెండా" అనే పాటలో "పేదవాళ్ళ పోరుపురికి" నప్పుడు "దొరల కడుపున ఉరుము పుట్టెను" అని వ్రాస్తాడుకవి, అలాగే "పల్లె పల్లెన ఎరుపు మురుపు / గుండె గుండెన బాధమరుపు" అంటాడు పోరాటదశలో దొరల గుండెల్లో భయం "ఉరుము" పల్లెప్రజల్లో బాధను మరిపించే "ఎరుపు మురుపు". "రెండు నక్షత్రాలు" అనబడే పాటలో కూడా రామచంద్రయ్య, రామనర్సయ్యలు ప్రజలకోసం ప్రాణమిచ్చిన యీ వ్యవస్థలోని భౌతిక పరిస్థితులను, సామాజిక సంబంధాలను పోరాటాన్ని కవిత్వపరంగా వర్ణించడంలో "సమ్మి" కృతకృత్యుడయ్యాడు. కష్టజీవులైన రైతులు భౌతిక సామాజిక సంబంధాలకు అద్దంపట్టే వారి భాషను మాత్రం వాడలేకపోయినాడు.

కష్టజీవుల జీవిత భౌతిక పరిస్థితులతో ఈ కవికి కావల్సినంత పరిచయం లేదన డానికి ఇంకో నిదర్శనం ఈనాటి సాంఘిక జీవనాన్ని ఎడారితో పోల్చడంలో కన్పిస్తుంది శ్రమకోలీన జీవనం ఎడారిలాగా విలువలకూ కలలకూ దూరమైంది. ఎండమావుల్లాంటి

అశలకు నిలయమైంది. కాని ఈ లక్షణం బూర్జువాసమాజ లక్షణం. కష్టజీవుల బ్రతుకు లక్షణం కాదు. "నాకు విశ్రాంతి లేదు" అన్న కవితలో "నమ్మి" "ఇలా మైళ్ళ ముళ్ళ మైదానాల దాటి / జైళ్ళలాంటి దారుణ నిశ్శబ్దాల్ని చీల్చి / శ్మశాన సహనాన్ని మోసి / ఎంతకాలం పయనించాలి?" అని ప్రశ్నించుకుంటాడు. అయితే ఈ సామాజిక యథార్థం బూర్జువా జీవితానికి సంబంధించింది. శ్రమజీవి బ్రతుకు యింతకన్నా ప్రమాద భూయిష్టమైంది కాని యింత నిర్వీర్యమైంది కాదు. ఇలాంటి జీవితాన్ని వీడి పోరాటాన్ని చేరుకొనే క్రమంలో కవి "విశ్రమిస్తే బావుణ్ణేమో" అనుకుంటాడు. కాని విప్లవభావాలు వంటబట్టించుకున్నాడు గనుక "లేదు - లేదు" అనుకుని

ఈ మొగ్గలు
ఎర్రమందారాలై
ఆకాశమంత ఈనేంత వరకు
నారక్తంలో వాటి బింబం ప్రతిఫలించేంత వరకు
ఈ ఎడారిలో
ప్రతి యిసుక రేణువూ
ఎదురు తిరిగేంత వరకు

"నాకు విశ్రాంతి లేదు" అని సమాధానపర్చుకుంటాడు. ఈ సందిగ్ధ పరిస్థితి స్పష్టంగా మధ్యతరగతి మనస్తత్వానికి చెందింది. ఎడారిలో యిసుకరేణువులు మధ్యతరగతి ప్రజలు. కాని కష్టజీవులు పాణిగ్రాహి అన్నట్లు "ఒక్కొక్కరు అగ్నికణం" కాబట్టి "నమ్మి"ను మధ్యతరగతి జీవితాన్నుండి విడివడే ప్రయత్నంజేస్తూ గోదావరిలోయ పిలుపందుకుని రైతుకూలీల విప్లవకారుల జీవితాల్తో కలిసి గోదావరి పాయగా ప్రవహిస్తున్న కవిగా వర్ణించవచ్చు.

## అమ్మ చెట్టు

అమ్మచెట్టుకవి దేవీప్రియకూడా సమకాలీన జీవితాన్ని ఎడారితో పోలుస్తాడు.

ఎడారిలో ఎండ ఫెళఫెళలాడే వేళ
తన కాళ్ళకిందే కళ్ళుంచి
తలదాచుకోను నీడకై వెతికే ఈతచెట్టుకీ
నా జీవితానికీ పోలుస్తానునేను- ("మూడోకన్ను")

అతడు మధ్యతరగతి జీవితాన్ని, తననూ ఫ్యానుతో, ఫ్యానుగాలిలోగాలై "గిరికీలుకొడుతూ / విశ్చలనంలో చలనాన్నిచూసే / కవి" తో, కరెన్సీగొడుగుకింద వర్ధిల్లే కుక్కగొడుగుతో, గాలిపటంతో, కన్నీటి కాయలుకాచే జీవితం చెట్టుతో పోల్చుకుంటాడు- ఇవన్నీ బూర్జువా జీవితసత్యానికి ప్రతీకలు- అయితే తనను

వ్యవస్థ గుహాంతర్భాగాల్లో మేలుకున్న
నవ్యాలోచనా వివేచనాసింహాలు ("అక్షరసంగమం")

అయిన మేధావుల్తోకూడా పోల్చుకుంటాడు- మేధావిగా "నేనీ / మెదడు పేకు నుంచి తీస్తున్న / ఆలోచనదారం / చిరుగులుకుట్టడానికే అయినా / బతుకుసూది బెజ్జంలో దూరి" కోరుకునేది-

విద్యుత్తులాగ హృదయంలాగ
మంటలాగ కవిత్వంలాగ
నిరంతర చలనంలో క్షోభలో
తిరుగుబాటులో
శాశ్వతంకావాలనే
వెలుతురు జీవనదిలాగ
అనంతంగా ప్రవహించాలనే। ("జీవనది")

కవిగా కూడా అతడు

దారిద్ర్య దావానల భీతికి
మరికొంత మంచి ఉపమానం దొరుకుతుందేమోనని ("నేస్తం భవానీ")

వెతుక్కునే, సభలలో చప్పట్లు కొనుక్కునే కవులలో ఒక్కడే దరిద్రం గూడ అతనికి విద్యుత్తులాగ, హృదయంలాగ, కవిత్వంలాగ, తిరుగుబాటులాగ ఉపమానాల్లో వెదుక్కోవలసిన విషయమే, కాని శ్రమజీవుల జీవిత వాస్తవికత అనబడే భౌతిక పరిస్థితితో ప్రత్యక్ష సంబంధం లేకుండా వాటికి ఉపమానాలూ దొరకవు అతడికి.

"నేలమీద నిలిచి / చుక్కల పావురాలకు దృక్కులవల విసుర్తూ / గట్టున నిలిచి / నిలువెత్తులోతున ఉరికేయేటిలో / ఈత నేర్వాలని తహ తహ పడుతూ / అవాస్తవిక జీవిత చిత్రానికి / వాటర్ కలర్స్ పులిమి రమణీయంగా తీర్చిదిద్దాలనే / ఇనుమునకు తెలమ్మలాంటి ఆశ" మధ్యతరగతి మేధావులకూ, కవులకూ ఉన్నట్లే అతనికీ ఉన్నట్లుంది. అందుకే,

నానుదుటి మీద
రెపరెప లాడుతున్న కన్నుదీపం
నాతలమీద గాలి తరంగాలపై ఈదుతూ
వెలుగుజెండా— అంటూ పాడుతూ, బూర్జువా భావుకతతో తనకుతాను
బిగించిన పిడికిలిలో
కాగడాగా మండుతూ కలం
నేను నేనే
నవతరం కవిని ("కవి")

అని ఊహించుకొంటాడు. అయినా "జనస్పందనా ప్రవాహంలో / ముందు కురికే పాయ...."గా కావాలన్న తహతహ ఉన్న వాడు కాబట్టే

జీవితం చెట్టుకే
ఆకుల పిడి బాకులుకూడా
పుడతాయి ("అమ్మ చెట్టు")

అన్న సత్యాన్ని గ్రహించాడు. అయితే మొదటిలైనులో "జనజీవితం చెట్టుకే" అని వుండాల్సింది. ఈ కవి "వాక్కు" అన్న కవితలో విప్లవకారుల గురించి వెలిబుచ్చిన సౌహార్దత మెచ్చుకోతగింది.

వచనకవిత ప్రమాణాల ననుసరించి దేవీప్రియ ప్రతిభావంతుడైన కవి. అతనికి విప్లవాత్మక భౌతిక పరిస్థితుల గురించి, ఉత్పత్తి సామాజిక సంబంధాల గురించి సిద్ధాంత ప్రాతిపదిక లేకపోగా కనీసం స్పష్టమైన అవగాహన, అనుభవం కూడలేవు.

## ఎర్రగాలి

త్రిపురనేని మధుసూదనరావుగారన్నట్లు "ప్రజావ్యతిరేక కవిత్వం మీద తిరుగు బాటుచేసిన" కవి జైరామ్. ఈ సంకలనంలో "నామాట"గా కవి చెప్పినట్లు 1968 నుండి 1973 దాకా రాసిన కవితలుంచే ఆకాలంలో తెలుగులో రాయబడ్డ చాలా విప్లవ కవితల్లో ఉండే లోపమే వీటిలోనూ కన్పిస్తున్నది. ఆలోపం సిద్ధాంత సౌలభ్యంతో విప్లవాత్మక సామాజిక సంబంధాలను క్షుణ్ణంగా అవగాహన చేసుకోగల్గినా వాటిని కవిత్వంగా మలచడానికి కావలసిన భౌతిక పరిస్థితుల అనుభవం- అంటే శ్రామజీవుల బతుకును గురించిన పరిచయం- కావలసినంతగా లేకపోవడం. అందువల్లనే ఈయన

కవితలు భాషాపాటవం, అభివ్యక్తి, నిజాయితీగుణం ఉన్నా వినాదప్రాయంగా అనిపిస్తున్నాయి.

వేనవేలేండ్ల చారిత్రిక భౌతిక సత్యాలు
చాటిచెబుతున్న వర్గపోరాట దృక్పథం నుండి
సామాజిక పరిణామాల శాస్త్రీయ అవగాహన నుండి
నిజాన్ని గ్రహించు. ("స్వాతంత్ర్యం - ప్రజాస్వామ్యం")

వినాదప్రాయమైనా చారిత్రిక సత్యానికున్న బలం ఈలైన్లలో ఉంది. అయితే, ఈకవి కవితల్లో మంచి ఊహాబలముంది. అందుకుదాహరణలు టైటిల్‌కవిత "ఎర్రిగాలి", "విశ్వగీతం", "ఆయుధపూజ", "బాధ్యత"లు ధనస్వామ్యంలో బానిస సాహిత్య భజనపరాయణులై, సిద్ధాంతం వద్దంటూ, మానవతపోజుతో శాస్త్రీయ పరిజ్ఞానాన్ని మానవతను వంచిస్తున్న బూర్జువా కళాకారులకొకపాఠం "బాధ్యత". ఈ కవితలో సామ్యవాద సిద్ధాంతానికి ప్రజాకళలకూ మధ్యగల సజీవ సంబంధాన్ని ఈ విధంగా వివరిస్తాడుకవి,

భౌతికవాదం
మీ మధురోహల
అలల, కలల
ఊపిరిగా
వాస్తవికత
మీ భావనశక్తి బహిర్గతరూపం.

## సంకెళ్ళను తెంచుదాం

"ప్రజా పోరాటాల చదివి విన్నవాణ్నేతప్ప- కనీసం చూసిన వాణ్ని కొను. భవిష్యత్ సుందర సమసమాజంకోసం ఆ విప్లవవీరులు చెదరనిదీక్షతో పోరాటబాటలో కిరణాయుధాలెత్తి దూకుతూ త్యాగాల ఎర్రిబావుటాలెగరేస్తూ పోతున్నపుడు నాకవితలో ఎరుపు ప్రతిబింబించింది" అంటాడుకవి బి. పాండురంగారెడ్డి బాదావు ప్రతికవితా ఈ వాక్యాల్లోని నిజాన్ని ఉద్ఘాటిస్తుంది. పోరాటమంటే, విప్లవవీరులంటే, ఎరుపంటే అభిమానం ఈకవికి, కాని విప్లవకవిత్వానికి కావలసింది విప్లవాత్మక భౌతిక పరిస్థితుల గురించిన అనుభవం, సామాజిక సంబంధాలగురించిన అవగాహన అని ఇంతకు మునుపే చెప్పుకున్నాం. ఆ అనుభవం, అవగాహన ఆచరణ ప్రతి విప్లవకారుడికి

అవసరమైనట్లే సాంస్కృతిక విప్లవకారుడైన కవికీ, రచయితకూ అవసరం. కాని విప్లవాత్మక భౌతికపరిస్థితులతో సంబంధంలేని ప్రకృతి వర్ణనలూ, శ్రామికజీవికీ, సమాజానికీ, విప్లవకారునికీ సమాజానికీ మధ్యగల సంబంధాలగురించి సరియైన అవగాహన లేకుండా వారిగురించిన ఉపమానాలూ, నిర్జీవమైన బూర్జువాభావుకత ఈయన సంకలనంలో కొల్లలు.

---

1. 'గోదావరిలోయ' - 'నమ్ము' కవితలుపాటలు - ఉదయసాహితి ప్రచురణ (డిసెంబర్ 1981) పేజీలు, 72+xx, 1/8 డెమ్మీ, వెల రు. 3-50, ప్రతులకు : 'నమ్ము', సి85, వనస్థలిపురం, హైదరాబాద్

2. "అమ్మచెట్టు" దేవిప్రియ వచన పద్యాలు. సమతాబుక్స్ ప్రచురణ (సెప్టెంబర్ 1979) పేజీలు : 68+ viii, 1/8 డెమ్మీ, వెల రు. 3-00, ప్రతులకు : దేశీబుక్‌హౌస్, నారాయణగూడా, హైదరాబాద్ 500 029

3. 'ఎర్రగాలి' జైరామ్ విప్లవకవితలు- (జులై 1981) పేజీలు 70+xii+4, 1/8 డెమ్మీ వెల రు. 5-00, ప్రతులకు : జైరామ్, 20/142, హనుమేశ నగర్ గుంతకల్లు, అనంతపురం.

4. సంకెళ్ళను తెంచుదాం, బి. పాండురంగారెడ్డి కవితా సంకలనం అరుణ సాహితి ప్రచురణ (జనవరి 1981) పేజీలు, 52+ xvi +2 1/8 డెమ్మీ, వెల రు. 3-00, ప్రతులకు : ఏ. కామిరెడ్డి, అరుణసాహితి, వీరారెడ్డిపల్లి 518 576 నంద్యాల.

మానవతా విలువలు - 2

# 'నీ కొడుకుశవం కావాల్నా ? మూడువేల రూపాయలియ్యి'

పదిహేనునెలల్లో పదిహేను. నెలకొక 'ఎన్‌కౌంటర్' హత్యచొప్పున రికార్డ్ కొనసాగించడంకోసమా అన్నట్టు జనవరి 27 రాత్రి మాదాపురంగ్రామంలో అంకం నారాయణ, వాసం గజేందర్లను పోలీసులు 'ఎదురుకాల్పుల'లో చంపారు. ఐదు పేలుళ్ళు వినబడ్డాయట. నారాయణశరీరంలో మూడుబులెట్లు, గజేందర్ శరీరంలో రెండు బులెట్లు వున్నాయి. ఇక 'ఎదురుకాల్పుల' ప్రసక్తి ఎక్కడిది?

మాదాపురం మెట్టుపల్లితాలూకా (కరీంనగర్ జిల్లా)లోని ఒకగ్రామం. వరంగల్ నుండి కరీంనగర్ మీదుగా నిజామాబాద్ ఆదిలాబాద్‌లకువెళ్ళే రహదారిలో కోరుట్ల పట్టణానికి సమీపంగావుంది. కరీంనగర్ జిల్లాలోని అన్నివూళ్ళలాగే కోరుట్ల పట్టణం గోడలుగూడ ఎర్రెర్రని నినాదాలమయం. అయితే ఎక్కడా కనిపించనివిశేషం ఒకటి కోరుట్ల గోడలమీద కనబడుతుంది. నినాదాలపక్కనే నిర్వచనాలు కనిపిస్తాయి. 'సామ్రాజ్యవాదంఅంటే ఒకదేశం వేరొకదేశంలో పెట్టుబడిపెట్టి లాభాలరూపంలో ఆ దేశాన్ని దోచుకోవడం' అనేనినాదాన్ని వేరే ఏ పట్టణంగోడల మీదయినా చూసారా? బహుశా పక్కనున్న జగిత్యాలనుండి మెట్టుపల్లికి విస్తరిస్తున్న రైతాంగ ఉద్యమం ప్రభావంలో కోరుట్ల గోడలనే సిద్ధాంత గ్రంథాలుగా తీర్చిదిద్దారు.

ఆ ఉద్యమ విస్తరణ బాధ్యులలో ఒకడు కామ్రేడ్ అంకం నారాయణ. 25 సంవత్సరాల ఈ యువకుడు మాదారంనుండి 15 కిలోమీటర్ల దూరానవున్న మేడిపల్లి గ్రామానికి చెందినవాడు. పుట్టింది ఒక సాధారణ రైతుకుటుంబంలో. వ్యవసాయంతో బాటు బీడీపనిచేస్తుకున్నాడు. ఎనిమిదివరకు చదువుకున్నాడు. 'పీపుల్స్‌వార్' పార్టీ కరపత్రం మాటలలో 'అన్యాయాన్ని ఎదిరించడంలో ఎంతకయినా తెగించేస్వభావం నారాయణది.... కరీంనగర్ జిల్లాలో, ప్రత్యేకించి జగిత్యాలతాలూకాలో, రైతాంగ పోరాటాలు బద్దలవడంతో కామ్రేడ్ నారాయణ 1978 నుండి విప్లవ రాజకీయాల వైపు ఆకర్షించబడి ప్రజాపోరాటాల్లో పార్టీకార్యక్రమాల్లో రోజురోజుకూ మరింత ప్రబలంగా నిమగ్నంకాజొచ్చాడు. జగిత్యాలలో జరిగిన రైతుకూలీ మహాసభ ప్రభావంతో ఆయన మెట్టుపల్లి తాలూకాలో అనేకగ్రామాల్లో యువకుల్ని రైతాంగాన్ని సంఘటితపరచి పోరాటాలునడపడానికి అవిరళంగా కృషిచేసాడు' ప్రజలనుండి మామూళ్లు దండుగలు వసూలుచేసే భూస్వాములను పెత్తందార్లుగామారిన అధికార్లను నిలదీసి ఏళ్ళతరబడి ప్రజలనుండి దోచుకున్న సొమ్మును ప్రజలకిప్పించాడు. తమ వర్గ ప్రయోజనాలేమిటో, శ్రామికవర్గ సిద్ధాంతమయిన మార్క్సిజం-లెనినిజం అంటే

ఏవిటో రైతాంగానికి వివరించిచెప్పి అతిత్వరలో భూస్వాములకు పక్కలోబల్లెంగా తూరాడు. పోలీసులకు తలనొప్పిగా తయారయ్యాడు. అతన్ని పట్టుకోలేని పోలీసులు వాళ్ళ పశుప్రవృత్తిని అనుసరించి అతని తల్లిదండ్రులపై దాడిచేయడం, కొట్టడం, అలవర్చుకున్నారు. గత మూడేళ్ళలో పదిమార్లు వాళ్ళనుకొట్టారట. తమను పోలీసులు బ్రతకనీయరని, కొడుకును చంపినట్టే చంపుతారని, వాళ్లు భయపడుతున్నట్లుగా వాళ్ళతో మాట్లాడిన పౌరహక్కుల సంఘం కార్యకర్తలన్నారు. పోలీసుల బారినుండి నారాయణ భార్యను రక్షించడానికిగాను అతని తల్లిదండ్రులు ఆమెను తమ కుమార్తెగా చెలామణీ చేసేవారటగూడ.

కామ్రేడ్ వాసం గజేందర్ 23 ఏండ్ల కుర్రవాడు. రాడికల్ యువజన సంఘం కార్యకర్తగా ఉండేవాడు. గత ఆరునెలలుగా బొంబాయి నగరంలో మోడి బట్టల మిల్లులో పనిచేస్తున్నాడు. కొంతకాలంగా బొంబాయిలోని నూలుమిల్లులలో నడుస్తున్న సమ్మెకారణంగా, గ్రామానికి ఇటీవలే తిరిగివచ్చాడు.

## ‘ఎన్‌కౌంటర్’లలో పోలీసులు దెబ్బతినరన్నది ఒక ప్రకృతిధర్మంగా అంగీకరించాలి.

27 సాయంకాలం చీకటిపడ్డ కొద్దిసేపటికి నారాయణ మాదాపురం గ్రామానికి వచ్చాడు. గ్రామం చేరేలోగా తన మోటార్ సైకిల్ చెడిపోగా దాన్ని గ్రామంబయట వుంచి నడిచివచ్చాడు. బక్కయ్య అనేవ్యక్తి పశువుల కొట్టంలోకిపోయి గజేందర్ కోసం కబురుపెట్టాడు. గజేందర్ వచ్చిన తరువాత పక్కనేవున్న ‘చాయ్’ దుకాణం నుండి చాయ్‌లు తెప్పించుకున్నారు. ‘ఎదురుకాల్పుల’ కథ బుకాయించడానికి విదర్శనంగా, అప్పటికే గ్రామంలో పోలీసులు మారువేషాలలో తిరుగుతున్నారు. ఈ సీజన్‌లో చెరుకుపంట కోతలకోసం లంబాడీలు మాదాపురం ప్రాంతానికి రివాజుగా వలస వెళ్తారట. పోలీసులు వాళ్లవేషాలు వేసుకొని గ్రామంలో జొరబడ్డారు. నారాయణ గజేందర్‌లకు చాయ్‌లు తీసుకుపోతున్న కుర్రవాడితో ‘చాయ్ నారన్న కోసమా?’ అని చొరవగా అడిగాడట, లంబాడీ వేషంలోవున్న ఒక పోలీసు. అవుననంగానే నారన్న (నారాయణ) కొట్టంలోవున్నట్లు తెలిసిపోయింది పోలీసులకు. చాయ్ తాగిన నారాయణ, గజేందర్, ఆ కుర్రవాడినే పాన్‌లు తెమ్మన్నారు. తీసుకపోతున్న అతన్ని పోలీసులు పట్టుకొని చావడిలో కట్టేసారు. మరొక ఇద్దరిని కూడకట్టేసి, ఇద్దరు పోలీసుల నిఘావుంచారు. అయిదు పదినిముషాల గడువులో పశువులకొట్టం నుండి అయిదు కాల్పులు వినబడ్డాయి. అప్పటికి సమయం 7.30 -8 మధ్య వెంటనే

పోలీసులు మొత్తం గ్రామాన్ని చుట్టుముట్టి, ఎవ్వరూ బయటకు రావడానికి వీలులేదని ఆదేశించారు. ప్రజలెవ్వరూ ఉల్లంఘించే సాహసం చేయలేదు.

తరువాతిరోజు (28 జనవరి) సాయంత్రం శవపరీక్ష జరిపారు శవాలను ఆస్పత్రికి తీసుకపోక కోరుట్ల సమీపంలోని ఒక వాగుపక్కన 30 40 మంది పోలీసుల బందోబస్తులో జరిపారు. తరువాత రెండు గోతులుతవ్వి పాతిపెట్టారట. అయితే శవాలను ఉండనీయడం ప్రమాదకరమని గుర్తించి మళ్ళీ శవాలను బయటకుతీసి తామే దహనం చేసారట. గజేందర్ తల్లి నర్సమ్మకు విషయంతెలిసి తనకొడుకు శవాన్నయినా ఇమ్మని అడిగితే ఆమెకు దక్కింది లాఠీదెబ్బలు. 'నీ కొడుకును సరిగ్గా పెంచక పోయినావా?' అని తిట్లు. ఇంకా మొండిపట్టు పట్టేసరికి పోలీసులు 3000 రూపాయ లిమ్మన్నారట శవంకోసం. బూర్జువా సమాజంలో తల్లీ బిడ్డల అనుబంధాన్ని గుడ్డి డబ్బు గుర్తిస్తుందా ప్రాణమూ మానమూ సహజవనరులు, భూమీ అన్నీ వ్యాపార సరుకులే అయిపోయిన 'పవిత్రభారతం'లో శవాలు మాత్రం ఏం పాపంచేసాయి.

ప్రజలనయితే ఆ దరిదాపులకు రాకుండ చేసారు గాని కాల్పులశబ్దాన్ని ఆపలేరు. అయిదు పేలుళ్ళు వినబడ్డాయని అక్కడి ప్రజలంతా అన్నారు. పోలీసుల కథనం ప్రకారమే నారాయణ శరీరంలో మూడు, గజేందర్ శరీరంలో రెండు, బులెట్లున్నాయి. మరిపోలీసుల మీద వాళ్ళు జరిపిన కాల్పుల తాలూకు బులెట్లుగాని కాల్పుల శబ్దంగాని ఏమయ్యాయి? ఒక్క పోలీసుకు దెబ్బదగలలేదన్నది వింతకాదు. 'ఎన్‌కౌంటర్' లలో పోలీసులు దెబ్బతినరన్నది ఒక ప్రకృతి ధర్మంగా అంగీకరించాలి. అయినా బుల్లెట్ల ఛాయలయినా వుండాలా? ఈ విషయంగ్రహించి తరువాతిరోజు పశువులకొట్టం గోడల్లో చిన్నచిన్న కంతలు చేసారట అయితే, నారాయణ గజేందర్‌లకు ఎదురుగా వున్నది తలుపేకాబట్టి. వాళ్ల 'కాల్పులు' జరిపినప్పుడు తలుపు తెరిచేవుంది కాబట్టి, వాళ్లకాల్చిన బులెట్లు పక్కనున్న గోడల్లో వుండడానికి వీలులేదు

కాల్పులుజరిపిన కోరుట్ల సి. ఐ లింగారెడ్డికి దౌర్జన్యాలుకొత్తకాదు. రైతాంగ ఉద్యమం మెట్టుపల్లికి వ్యాపించినప్పటినుండి దాన్ని అణచడానికి సర్వవిధాలా ప్రయత్నంచేస్తూనే వున్నాడు. హత్యచేసిన తరువాతగూడ భయపడలేదు సరికదా విర్రవీగుడు తగ్గలేదు, పౌరహక్కులసంఘం ఏర్పరచిన నిజనిర్ధారణ కమిటీతో వెళ్ళిన వకీళ్ళమీదసైతం బూతులుతిట్టాడు. 'వీళ్ళు తలలుతీస్తున్నప్పుడు ఏమయినయిరా లంజకొడుకుల్లారా మీ నిజనిర్ధారణకమిటీలు?' అన్నాడట. ప్రజాస్వామ్యవాదులు వేసుకోవలసినప్రశ్న, ఒకవేళ అంకంనారాయణ నిజంగానే తలలుతీసివున్నా (అది వాస్తవంకాదు) అతన్ని విచారణలేకుండ కాల్చేసేహక్కు లింగారెడ్డికిగాని మరొకరికి గాని వున్నదా అని.

# గిరిజన మృతవీరుల సంస్మరణ

ఎ. కె. రాయ్

1857లో బ్రిటిష్ ప్రభుత్వంతో పోరాటంచేస్తూ ప్రాణాలర్పించిన గిరిజన నాయకుడు వీరనారాయణ్, అప్పటి గిరిజన మృతవీరుల్లో బహుశా ఆయన మొదటి వాడు కావచ్చు. ఆయనస్మృతికి జోహార్లు అర్పించడానికిగాను ఛత్తీస్‌ఘర్ ప్రాంతపు వేలాదిమంది ఆదివాసులూ, యితరప్రజలూ గత డిసెంబర్ 19న మధ్యప్రదేశ్‌లోని దుర్గ్ జిల్లా బాలోడ్‌లో సమావేశమయ్యారు.

నాటి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో పాల్గొని ఛత్తీస్‌ఘర్ ప్రాంత ఆదివాసులు యితర వెనుకబడిన ప్రజలు నిర్వహించిన ఉజ్వలమైనపాత్ర గురించిన చరిత్ర విశ్వవిద్యాలయాల పరిశోధకుల, మేధావులచేత కాకుండా, పేదప్రజల, సాధారణ ప్రజల, దల్లీ రాజహార యినుపగనుల్లో పనిచేసే గిరిజనులచేత గుర్తింపబడడం నిజంగా విచిత్రమైన విషయం ! ఏ గ్రామసీమల్లోనే మనదేశం బతుకుతున్నదని నగరాల్లోని ఉన్నతవర్గాలకు తెలియదో, ఆ గ్రామాల్లోని ప్రజల సంస్కృతిని వీళ్ళ వీరోచిత గాథలూ, పాటలూ ఎంతో ప్రభావితం చేస్తున్నాయి. 1856లో ఛత్తీస్‌ఘర్ ప్రాంతంలో తీవ్రమైన కరువు ఏర్పడ్డప్పుడు ఆ ప్రాంతంలో ఆదివాసి రైతాంగ పోరాటం నిర్వహించి, గోదాముల్లో నిలువపడివున్న ధాన్యాన్ని పట్టుకొని ప్రజల్లో పంచినవాడు వీరనాయణ్ అని యిప్పటికి అందుబాటులోవున్న కొద్దిపాటి చారిత్రిక ఆధారాలు చెప్తున్నాయి. బ్రిటిష్‌ప్రభుత్వం ఆయనను అరెస్టుచేసి మూడు సంవత్సరాల జైలుశిక్షవేసింది. జైలును బద్దలుకొట్టి తప్పించుకొని ఆయన 1857 నాటి సిపాయీల తిరుగుబాటులో పాల్గొన్నాడు. ఆ పోరాటంలో వుండగానే డిసెంబర్ 19న ఆయనను చంపివేసారు.

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో గిరిజనులు యింత అమోఘమైన పాత్ర నిర్వహిస్తే మధ్యప్రదేశ్ ప్రభుత్వానికి ఏమీ తెలియకపోవడం ఎంత ఆశ్చర్యం ! ఏ బడిలోనూ, కాలేజీలోనూ వీరనారాయణ్ కథ చెప్పరు. ఛత్తీస్‌ఘర్ గని కార్మిక సంఘం వాళ్ళు చొరవతీసుకొని, ముందుపడితేగాని- ఆయన తనబతుకును ప్రజల కోసం ఎట్లా బలిపెట్టిందీ గుర్తుచేసుకోవడం గత సంవత్సరంనుండైనా మొదలయ్యింది సంఘాలుపెట్టుకుంటున్న పేద ప్రజలు తమ త్యాగాల చరిత్రను తవ్వి వెలికితీయడం- అందునా ఒక కార్మికసంఘం ఈ విషయంలో నాయకత్వం వహించడం- బహుశామన దేశంలో యిదే మొదలుకావచ్చు. ఏది ఏమైతేనేం, మధ్యప్రదేశ్ ప్రభుత్వానికి ఈ మృతవీరుడు పోయిన సంవత్సరంనుండి హఠాత్తుగా గుర్తుకువస్తున్నాడు : బడులకూ, వంతెనలకూ అతని పేరుపెట్టడం మొదలుపెట్టారు.

పుస్తక సమీక్ష:

## దిక్సూచి

సిరిసిల్ల సాహితీమిత్రులు కేవలం వర్తమాన కవిత్వానికి దర్పణంగా ఈ దిక్సూచిని తీర్చిదిద్దగలమని ప్రకటించారు. ఆ మేరకు సఫలమయారుగూడా. వర్తమాన కవిత్వం వర్తమాన సమాజం నుంచి పుడుతుండటంచేత వారి కవితల్లోగూడా ఆయా లక్షణాలు కన్పిస్తూ సమాజాన్ని ముందుకు నడిపేవిగావున్నాయి.

మొదటి సంచికలో రమగారి కవిత నిష్ప్రయోజనం. రెండో సంచికలో నగ్నముని కవితలో కొన్ని అపశ్రుతులున్నాయి. "అరిగిపోయిన సిద్ధాంతాయుధాలు వదిలి శత్రుమృత్యు రహస్యం ఎక్కడుందో గమనించాలి" అంటున్న ఆయన "అరిగిపోయిన" సిద్ధాంతం వద్దంటున్నట్లయితే పేచీలేదు. కానీ అసలు సిద్ధాంతాలే వద్దని అనడంలేదు గదా?! అరిగిపోయిన సిద్ధాంతాలు వద్దనడం అసలైన సిద్ధాంతాలవైపు దారితీస్తుంది. అసలు సిద్ధాంతాలే వద్దనే సిద్ధాంతం అరాచకత్వంవైపు దారితీస్తుంది నగ్నముని దేన్ని ప్రోత్సహించదలుచుకున్నారో స్పష్టంగా చెబితే బాగుండేది.

మూడో సంచికలో దామెర రాములు కవితనిచూస్తే అతనింతకు ముందు రాసిన కొన్ని కవితల ఛాయలు కన్పిస్తాయి శైలికూడా అదే. శివనాగులజయగారి కవిత చిత్రమైనశైలితో బాగుంది. నాలుగో సంచికలోని శివారెడ్డి కవిత 'శరీరం', అలశెట్టి ప్రభాకర్ 'విజరూపం' బాగున్నాయి. నగ్నమునిగారి 'శత్రుమృత్యు రహస్యం' కవితలో నూతనత్వం ఏమీలేదు. ఆయన పదాలుమారుస్తూ ఒకే భావాన్ని చెప్తున్నట్టున్నాడు. 'ఫలితం ఇవ్వని ఏసిద్ధాంతాలూ మనకొద్దు' బాగానేవుందికానీ ఫలితంఇచ్చే సిద్ధాంతం ఏదో ఆయన చెప్పటంలేదు. వర్తమాన కవిత్వదర్పణంగా తమ దిక్సూచిని తీర్చిదిద్దదలుచుకున్న సిరిసిల్ల సాహితీమిత్రులు ఇలాంటి విషయాల్లో జాగ్రత్త వహించటం మంచిది.

— కె. రాంమోహన్‌రాజు

---

దిక్సూచి - వర్తమాన కవితావేదిక. నిర్వహణ: సాహితీమిత్రులు, సిరిసిల్ల ప్రతులకు, వివరాలకు: దిక్సూచి 1-2-63, సిరిసిల్ల 505 301

---

భూగర్భంలోవున్న ఖనిజసంపదవలె- వీరనారాయణ్‌లాంటి ప్రజల పోరాటమూ, త్యాగమూ కలుపుకున్న విలువైన ఈదేశచరిత్ర యింకాఎంతో కనబడకుండా పడివుంది. వేలాది వీరనారాయణుల వారసత్వాన్ని వెలికితీసి విలువకట్టాల్సివున్నది. (5-1-82)

[ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీనుండి అనువాదం: జీ. డి.]

# పుస్తక స్వీకారం

1. తూర్పు - కవితాసంకలనం - తోటమహాదేవ్, నూతనసాహితి పబ్లికేషన్స్ [ఫిబ్రవరి 1982], పేజీలు 24 వెల 60 పైసలు ప్రతులకు : తోటమహాదేవ్, 10-3-116, గచ్చుబౌలి, సిరిసిల్ల 505 301.

2 కవితాదిక్సూచి - వర్తమాన కవితావేదిక- జనవరి 1982, నిర్వహణ : సాహితీ మిత్రులు, సిరిసిల్ల - 16 పేజీలు వెల : లేదు- ప్రతులకు: దిక్సూచి, 1-2-63, సిరిసిల్ల 505 301.

3. గండ్రగొడ్డలి- ప్రవాసాంధ్రుల ఏకైక విప్లవాత్మక పక్షపత్రిక, సంపాదకురాలు: లక్ష్మిగరిమెళ్ల, సంవత్సరచందా రు 24-00 అడ్రస్ : కోదండ ప్రింటర్స్ రాయగడ 765 001

4. భారతదేశంలో నా జైలుజీవితం - మేరీటైలర్ అను : సహవాసి - హైదరాబాద్ బుక్‌ట్రస్టు ప్రచురణ (జనవరి 1982) పేజీలు : 228 + viii, 1/8 డెమ్మీ, వెల : రు. 10-00

5 వేమన్నవాదం - సంకలనం వ్యాఖ్యాత : డా. ఎన్. గోపి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ (రెండవముద్రణ, డిసెంబర్ 1981)
పేజీలు : 141 + XL + 2, 1/8 క్రౌన్, వెల రు. 6-00

ఈ రెండుపుస్తకాలూ ప్రతులకు : హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, 3-6-694, హిమాయత్‌నగర్, హైదరాబాద్ 500 029

6. ఎక్స్-రే - ఆధునిక కవితావేదిక- జనవరి 1982 ఎడిటర్ : కొల్లూరి, పేజీలు 16 వెల: 0-25 పైసలు ప్రతులకు: ఎక్సరే, కొల్లూరిహౌజ్, అమలాపురం-533 202

---

సవరణ

ప్రెస్సులో దిద్దినప్రకారం ప్రూఫ్‌లు సవరించక పోవడంవల్ల, ఒక్కొక్కసారి ప్రూఫ్‌లు ఇవ్వకుండానే ప్రింట్‌చేయడంవల్ల సృజనలో అనివార్యం ఒక్కొక్కసారి భావాన్నికూడా తలకిందులుచేసే అచ్చుతప్పులు జరుగుతున్నాయి. ఉదాహరణకి 41వ పేజీలో చివరిపేరా మొదటివాక్యం వియత్నాం ప్రజలు అమెరికా సామ్రాజ్యవాదానికి ఇచ్చినంతటి పోరాటం సోషల్ సామ్రాజ్యవాదానికి ఇవ్వగలదు అని చదువుకోవాలి

60వ పేజీలో కిందినుంచి మూడవలైను చివర 'ఇనుమున'కు ఇసుమున అచ్చయ్యింది ఇందుకు చింతిస్తున్నాము.

# మీకోసమే చూస్తున్నాము

మీరు ప్రజల్లోగానీ, ప్రజోద్యమాల్లోగాని పనిచేస్తున్నారా ?

మీకు వచ్చే, ప్రజలకు పనికొచ్చే పనిలోపాల్గొని తద్వారా మీ జీవనభృతికి కూడా కొంత ఆసరాకల్పించుకోవాలనుకుంటున్నారా ?

## అయితే మీకు ఇదే మా ఆహ్వానం!

హైదరాబాద్ బుక్‌ట్రస్టు పుస్తక ప్రచురణసంస్థ. ఇప్పుడిప్పుడే, నిల దొక్కుకుంటూ ప్రయోజనాత్మక, ప్రగతిశీలక పుస్తకాలను ప్రచురిస్తున్నది. ఇప్పటివరకు వెలువడిన పుస్తకాలు రక్తాశ్రువులు, కూలిగింజలు, వేమన్న వాదం, ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర, గ్రహణాలకథ, స్పార్టకస్, భారతదేశంలో నా జైలుజీవితం, వైద్యుడులేనిచోట, కార్టూన్‌లలో మార్క్స్ మొదలగునవి.

ఇంకెన్నో పుస్తకాలు రాబోతున్నాయి. అమ్మకాలు ప్రోత్సాహకరంగా ఉన్నాయి.

మీవూళ్ళోగానీ, పట్టణంలోగానీ వెయ్యిరూపాయల విలువగల పుస్తకాలమ్మితే రు. 330/- కమీషను లభిస్తుంది. అయితే మీనుండి ఏదోరకమైన గ్యారంటీ గానీ, డిపాజిట్‌గాని కోరుతున్నాము.

మీకీపని నిజంగా నచ్చితే, సవాలుగా తీసుకోగలిగితే వెంటనే మాకు రాయండి.

హైదరాబాద్ బుక్‌ట్రస్టు
3-6-694, హిమాయత్‌నగర్
హైదరాబాద్ 500 029

పీస్ బుక్ సెంటర్
4-5-421, సుల్తాన్‌బజార్
హైదరాబాద్ 500001.

# కొత్తపుస్తకాలు

క్రాంతి ప్రచురణలు :

1. సోవియట్ కమ్యూనిస్టు (బోల్షివిక్) పార్టీచరిత్ర రు. 20-00
2. గతితార్కిక చారిత్రక భౌతికవాదం - స్టాలిన్ రు. 1-50
3. తత్వశాస్త్రం మాయాజాలంకాదు రు. 2-00

విరసం ప్రచురణలు :

4. తుడుం - ఇంద్రవెల్లిపై కవితాసంకలనం రు. 1-25
5. కళలు, సారస్వతం ఎవరికోసం ? మావోచేసిన ప్రసంగం రు. 1-00
6. సాహిత్యం కుట్రకాదు, రచయితలు కుట్రకారులుకారు
త్రిపురనేని మధుసూదనరావు కోర్టుప్రకటన రు. 1-00
7. లూసున్ సాహిత్యజీవితం రు. 1-50

యుగప్రచురణలు :

8. రిహార్సల్ - ఎన్. కె. కవితాసంపుటి రు. 2-00
9. గద్దర్ పాటలు రు. 3-50
10. వర్గీస్‌పాటలు రు. 3-00

ఇతర ప్రచురణలు :

11. రోడ్డుమీద సూర్యుడు - రాంమోహన్‌రాజు కవితాసంపుటి రు. 3-00

ఈ పుస్తకాలన్నీ సృజన దగ్గరకూడా దొరుకుతాయి.

SRJANA Telugu Monthly Feb. '82 H/WL-10
Regd. No. with Registrar of Newspapers 10953/67.

# చెరబండరాజు

మ్రోగుతున్న ప్రజలవాణి
ఆగి మూగవోతున్నదా?
దోపిడిపెత్తన్దారికి
తోడా? ఈ చావుకూడ.
ఎదిరించిన ప్రతివ్యక్తికి
ఈ వ్యవస్థలో అవస్థ
రాజీపడు 'మేతావి'
పాటీలకు మజామజా
తిరుగుబాటు పోరాటం
చెరబండరాజు బ్రతుకు
అన్యాయం అంతమొంద
నంతవరకు సాగుచుండు
దోపిడిదౌర్జన్యాలకు
తోడై బ్రతుకుప్రభుత్వం
బందిపోటు దొంగదొరల
బలగం నేటిప్రభుత్వం

అన్యాయాన్నెదిరించిన
వాడు నాకుఆరాధ్యుడు
పేరుకు బ్రతికున్నప్రభుత
పేరుకు చస్తున్న 'రాజు'
అన్యాయాన్నెదిరిస్తే
నాగొడవకు సంతృప్తి
అన్యాయం అంతరిస్తె
నా గొడవకు ముక్తిప్రాప్తి

— కాళోజీ

SRJANA
Hanamkonda-506001

Single copy Rs. 2-00
Yearly Subscription Rs. 20-00